# ఇండోనేషియా స్వాతంత్ర్యపోరాటం

12

డిస్ట్రిబ్యూటర్సు :

రాధేశ్యామ్ ఏజెన్సీస్, బెజవాడ.

# ఇండొనేషియా స్వాతంత్ర్యపోరాటం

శేఖర్



విజ్ఞాన సాహిత్యవనం
బెజవాడ :: సికింద్రాబాద్

# ఇండోనేషియా స్వాతంత్ర్య దినోత్సవం

## అఖిల భారత జాతీయ మహాసభాధ్యక్షుని ప్రకటన

అఖిలభారత జాతీయ మహాసభాధ్యక్షులు, పండిత జవహర్‌లాలు యీ దిగువ ప్రకటన చేశారు :

"డచ్ వారు అణగద్రొక్కి, నాశనం చేయాలని చూస్తూన్న జావా ప్రజారాజ్యంలో ప్రతిరోజు వైమానికపోరాటాలు సాగుతున్నట్లు, వార్తాపత్రికలవల్ల, తెలుస్తోంది. మిత్రరాజ్యాల విమానాలుకూడ డచ్చివారితో సహకరించినట్లు తెలియ వస్తోంది. మనం యిక్కడ స్వాతంత్ర్య పోరాటాలలో నిమగ్నమైవున్న సమయంలో అక్కడ ఇండోనేషియాలో మన సోదరులు తమ స్వాతంత్ర్యాన్ని నిలుపుకొంటూ తమ కష్టార్జితమైన ప్రజారాజ్యాన్ని కాపాడుకోవటానికి ప్రయత్నిస్తున్నారనే విషయం మనం బాగా జ్ఞాపకముంచుకోవాలి.

"ఆగష్టు 17 ఇండోనేషియా స్వాతంత్ర్యదినం' ఆనాడుభారతదేశంలోని స్వాతంత్ర్య పిపాసులంతా ఆసియా స్వాతంత్ర్యం కాంక్షించే ప్రజలందరి పోరాటంలో భాగమైన ఇండోనేషియా స్వాతంత్ర్య పోరాట విజయాని కెల్లప్పుడూ శాయశక్తులా సాయం చేయటానికి సంసిద్ధులై, వారి శ్రేయస్సు నెల్లప్పుడూ కాంక్షిస్తూ శుభసందేశాలను పంపిస్తారానాడు. ఆనాడు బొంబా

యిలో జరిగే ఉత్సవాల్లో నేను పాల్గొనటానికి ఉబలాట పడుతున్నాను.

"ఇంతకుముందుకంటె తూర్పుదిశనుంచి మధ్య యేషియా వరకుగల దేశాల ప్రజలలో స్వాతంత్ర్య పిపాస యినుమడించి తద్దైక్యత స్పష్టంగా కనిపిస్తోంది, ఆ ఐక్యతా భావాలను, కాంక్షను బలపర్చటానికీ, తత్స్వాతంత్ర్య సంపాదనకు ఆ దేశాలమధ్య సంబంధబాంధవ్యాలు యెక్కువ కావలసివుంది. అందుకుగాను వచ్చే జనవరి, ఫిబ్రవరి (1947) నెలల్లో ఒక మహాసభ నేర్పాటు చేయ సంకల్పంవుంది. ఈలోపున జావాలోనూ, యితర దేశాల్లోనూ జరుగుతున్న స్వాతంత్ర్యపోరాటాలకు మన సానుభూతి, అభివందనాలు!"

వార్ధా, ఆగష్టు, 10, 1946.

---

# పరిచయం

ఇప్పటికి మూడుశతాబ్దాల ముందునుంచీ ప్రారం భమైన ఐరోపా వలసరాజ్యసంపాదనకు యీ ఇరవయ్యో శతాబ్దం మధ్యభాగంలో యెదురుదాడి ప్రారంభమైంది. యూరపులో పారిశ్రామిక విప్లవానంతరం కలిగిన నూతన యంత్రిజ్ఞానంతో ప్రపంచ పరిశోధనా ప్రయత్నంప్రారంభ మైంది. నూతన దేశాలను కనుగొనటం అక్కడ తమకు దొరకని వస్తువులు సమృద్ధిగా లభ్యంకావటం జూచిన తర్వాత ఐరోపీయులకు తమ స్థితి తెలిసివచ్చింది. అప్ప టికి నావయాత్రలలో, నావికా నిర్మాణంలో శైశవ దశలో నున్న ఐరోపీయ రాజ్యాలకు నావికానిర్మాణం అభివృద్ధి చేసుకోవాలనీ, ప్రాగ్దేశాలతో వ్యాపారం చేయాలనీ, వాళ్ళకులేని భోగసంపద ననుభవించాలనే ఆకాంక్ష ప్రబలింది. దానికి తోడుగా ప్రాగ్దేశ ప్రజల ధర్మబద్ధమైన ప్రవృత్తి, జీవకారుణ్యతత్వ జిజ్ఞాస వారిని మరింత ప్రోత్సహించాయ్. స్వేచ్ఛావ్యాపారం చేసు కోవటానికి వ్యాపారంతో ప్రారంభించిన కార్యక్రమం రాజ్యసంపాదనావసరాన్ని కలిగించింది గుత్తవ్యాపారం కోసం. చివరకు చలనంలేని శాసన రాజ్యాంగనిర్మా ణంతో పూర్తయింది.

తమ శాసిన రాజ్యాంగాలను బలవత్తరంగా నిర్మించుకొని, శాశ్వతంగావుండాలనే కోర్కెతో అమా నుషచర్యలతో ప్రజలలోని స్వాతంత్ర్యపిపాస నణచి, క్రూరశాసనాలతో బంధించారు ఐరోపీయులు. తద్రా

జ్యాంగ పునాదుల బలంకోసం అంతకుముందు దేశంలో వున్న చిన్నచిన్న బలవంతులైన సర్దార్లను దగ్గరకుతీసి, ధన, స్త్రీ, అధికార వ్యామోహితుల్నిచేసి, తమ ప్రజల పైన హృదయంలేని పెత్తనదార్లుగా తయారుచేసి పరిపాలన సాగించారు.

అట్టి రాజ్యాంగాలే ఆసియా అంతటా వున్న దేశాలలో వున్నయ్. దూరప్రాచ్యంలోని చైనా, జపాను లాంటి దేశాలు త్వరలో మేల్కాంచి యీ పశ్చిమ సామ్రాజ్యపిశాచి క్రూర హస్తాలబారినుంచి తప్పించుకొన్నాయ్.

కాని జపాను యూరోపునుచూచి తానుకూడ పారిశ్రామికరంగంలో అమెరికా, ఐరోపా దేశాలతో పోటీచేయనెంచి తత్సాధనా ప్రయత్నంచేసి కృతకృత్యురాలైంది. దానితో సామ్రాజ్యదాహం యినుమడించి 'ఐక్యఆసియా' ఉద్యమాన్ని స్వాతంత్ర్యంపేరుతోను, ఆసియా దేశాలను పశ్చిమసామ్రాజ్య దోపిడీనుంచి రక్షించాలనీ చెప్పి తనస్వార్థాన్ని యీడేర్చుకో ప్రయత్నించి చైనాలో 1937 లో ఆక్రమితయుద్ధాన్ని ప్రారంభించి 1942 నాటికి భారతదేశంవరకూ వచ్చింది. అమెరికా, బ్రిటన్, యితర ఐరోపా దేశాలకంటె మిన్నయైన సామ్రాజ్యాన్ని నిర్మించజూచింది, కాని విధివశాత్తు సాధ్యపడలేదు. అంతకు ముందే అభేద్యమైన సైనిక, ఆయుధ సంపత్తితో తయారైవున్న అమెరికాతోను, వలసరాజ్యాలబలంతో

వున్న బ్రిటనుతోను ఎదుర్కోలేకపోయింది. జపాను ఒంటరిగా తన మిత్రరాజ్యాల ఓటమితో.

పశ్చిమ సామ్రాజ్య దొంగలదోపిడీకి గురియైన దేశాలలో 'ఇండోనేషియా' దీవులు ఒకభాగం. ప్రపంచ మహాసంగ్రామకాలంలో కలిగిన అవకాశాన్ని వినియోగించుకొని అక్కడి ప్రజలు శాశ్వత బానిసత్వం నుంచి విముక్తి చెందటానికి ప్రయత్నించి స్వతంత్ర ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించుకొన్నారు. యుద్ధకాలంలో తమ అవసరాలను యీడేర్చుకొనే నిమిత్తం దొంగ, శుష్కవాగ్దానాలతో కాలంగడిపి యుద్ధానంతర ఆవాగ్దానాలను మరిచి, మఃపించబోయిన డచ్ సామ్రాజ్యవాదులకు ఇండోనేషియా ప్రజలు తమ స్వాతంత్ర్య కాంక్షను ధైర్యంగా ప్రకటించి, ఎదిరించి చక్కని సమాధానం చెప్పారు. ఏవిధంగానైనా తమవ్యాపారానికి మార్కెట్టు నిలబెట్టుకోవాలని పెనగులాడే డచ్ సామ్రాజ్యానికి స్వాతంత్ర్య పిపాసులైన ఇండోనేషియా ప్రజలు తమ వీరోచితసాహసాలను ప్రకటించారు. దొంగవాగ్దానాలను నమ్మమనిచెప్పారు సాయుధులై.

మిత్రమండలిలో సభ్యురాలై, ప్రపంచ శాంతి కోసం అమితావేశాన్ని ప్రకటించే బ్రిటీషు కార్మిక ప్రభుత్వంకూడ డచ్ సామ్రాజ్య సైన్యాలకు తోడ్పడి మానవుల ప్రాథమికహక్కైన స్వాతంత్ర్యాన్ని ఒకవైపున భారతదేశంలో హరించి యితర ప్రభుత్వాలదోపిడికి తోడ్పడ జూచింది, కాని విఫలమైంది.

ఈనాడు ప్రతిబానిస దేశంలోనూ స్వాతంత్ర్య పోరాటం సాగుతోంది. భారతీయులుకూడ తత్స్వాతంత్ర్య సాధనా ప్రయత్నంలో నిమగ్నులై వున్నారుగనుక యితర సోదర దేశీయులకు యితరత్రా తోడ్పడలేక పోయినా సానుభూతిమాత్రం పూర్తిగ చూపిస్తున్నారు. ఐక్య ఆసియా స్వాతంత్ర్య దేశాల సంఘటనకొరకు కృషి చేస్తు న్నారు. ఇది భారతదేశచరిత్రలో 'అభ్యుదయకర అధ్యాయప్రారంభము

ఇండొనేషియా స్వాతంత్ర్య పోరాటాన్ని గురించి భారతదేశంలో యెక్కువ విషయాలు తెలియవు. తెలుసు కొనేటందుకు అవకాశాలు కూడ చాల తక్కువ. వీలై నంతవరకు భారతదేశంలోను, యితరత్రా ప్రకటితమైన పుస్తకాలు, పత్రికలలోని విషయాలను సేకరించి మిత్రుడు 'శేఖరు'ను ప్రోత్సహించి అడగ్గానే అంగీకరించి తయారు చేసి యిచ్చి తెలుగులో మొదటి పుస్తకంగా వెలువడే అవకాశాన్ని కలిగించినందుకు కృతజ్ఞత.

ఇదే ప్రథమ యత్నం కావటంచేతా, సంస్కృత భాషాపరిచయం యెక్కువగా వుండటంచేతా భాష కొంచెం గ్రాంధికంగానడిచింది. అయినా సులభంగానే వుంది. ముందుముందు రాజకీయ, చారిత్రక విషయ పరిశోధనచేసి తెలుగు పాఠకులకు అభ్యుదయగ్రంథాల నందించగలడని ఆశిస్తున్నాము.

సంపాదకుడు.

# ఉపోద్ఘాతము

ఆగ్నేయ ఆసియాలోని దేశములయొక్క ప్రాముఖ్యత ముఖ్యముగా యుద్ధకాలమందు గుర్తించబడెను. సీనారేకు, రబ్బరు, నూనె యీ ప్రదేశమందు వుండుటచే యీ దేశముల ప్రాముఖ్యత ఎక్కువాయెను. అంతర్జాతీయ రాజకీయములు అర్ధము చేసుకొనవలెనన్న యీ భూభాగము ఏ మాత్రముపాత్ర వహించునో తెలుసుకొనవలెను. పశ్చిమదేశములన్నియు పారిశ్రామిక దేశములాయెను. పరిశ్రమలకు ముడిపదార్థములవసరమాయెను. ఆ ముడిపదార్థములు దొరుకుప్రదేశములకొరకు ఒకదేశమున అంతర్యుద్ధములు కానవచ్చును, న్యూజిలాండు, ఆస్ట్రేలియా దేశములు వలన రాజ్యములుగా స్థాపింపబడుట యిక్కడి దేశములయొక్క ప్రాముఖ్యతమరీ ఎక్కువాయెను.

ఐరోపా, ఆసియాదేశములలో జర్మనీ, రష్యాలు తప్ప మిగత అన్నిరాజ్యములు యీ సమస్య పరిష్కరించుటకు ప్రయత్నించెను. ఇంగ్లీషువారికి ఇండియా, మలయా, సింగపూరు, ఆస్ట్రేలియా, న్యూజిలాండు దేశములు స్వాధీనములోనుండుటచే యీ భూభాగములో వారికి ఆశయుండెను. ఫిలిపైన్సు దీవులలో అమెరికాకు ఫ్రెంచివారికి ఇండోచైనాలోనుహక్కులు వుండుటచేతను ఈ వివిధదేశములకు యీ భూభాగమందు ఆశలుండెను.

ఆర్థికమాంద్యమున్న రోజులలో ఆగ్నేయ ఆసియాలోని దేశములయందు వలస విధానము పూర్తిగా మారిపోయెను. వలసరాజ్యము లంటే పరప్రభుత్వముచే పరిపాలించబడుచు, ప్రపంచ పారిశ్రామిక దేశములకు ముడి పదార్థములను తయారుచేయుచుండుట కాన్నదును. వలస రాజ్యవిధానములో మార్పులు తప్పక తీసుకొని రావలె నని అందరు గుర్తించిరి.

యుద్ధపూర్వకాలమందు యీ దేశములలోని ముడిపదార్థములను సరిగా ఉపయోగించలేదు. ఉపయోగించవలెనని ఉద్దేశ్యమున్నయెడల ఎంతయో డబ్బు ఖర్చుపెట్టవలెను. ప్రస్తుతశాస్త్రజ్ఞాన సహాయముతో బర్మా, సుమిత్రా, బోర్నియోలలోని నూనెగనులను త్రవ్వ వచ్చును. రబ్బరు, రేకు, కలప తదితర అటవీ పదార్థములు సరిగా ఉపయోగించవలెనన్న పారిశ్రామిక విధానమును దేశములో అమలుపెట్టవలెను. ప్రపంచములో రబ్బరులో 90 పాళ్ళు పెరలు హార్బరునుండి ఎగుమతి యగుచుండెను. క్వాయినాకూడా సమృద్ధిగా పండుచుండెను. చక్కెర, మాంగనీసు, టంగ్‌స్టన్ యిటువంటి పదార్థములు ఉత్పత్తి ఇక్కడ అంతు లేదాయె. ఇవి ఏవిధముగా యుద్ధపూర్వ పరిశ్రమలకు అవసరమో పైన ఉదహరించబడిన విషయములనుండి అర్థమగును.

ఇక్కడ ఆర్థిక విధానమును గూర్చి కొద్దిగా యోచింతము. ప్రజలకు అవసరములను దీర్చుటకొరకు

దేశప్రజలు వ్యవసాయము చేయుట, దీనిపైన పరదేశపు ప్రజలు భూమిని గుత్తకుతీసుకొనుట, గనులను తవ్వించుట, ప్రభుత్వమువారుగూడా తిండిపదార్థముల ఉత్పత్తికన్న పరదేశములకు ఎగుమతి చేయుటకు పనికివచ్చెడి పదార్థములను ఉత్పత్తి చేయుటకు ప్రోత్సాహమిచ్చెడివారు.

ఈ దేశముయొక్క ఆర్థికసంపద వృద్ధిచేయుటకు హిందూదేశము ముఖ్యము. ఏ సమయమునైతే యీ రెండు భాగములను ఐక్యపరచి ఒకటే రక్షణవిధానమును ప్రభుత్వమువారు అమలులో పెట్టుదురో అప్పుడే యీ భూభాగము సౌఖ్యమును పొందవచ్చును.

కొంతమంది యీ భూభాగమును మరల పరిపాలించుటకు ఒక నానాజాతిసమితిని స్థాపించవలెనని చెప్పుదురు. వలసరాజ్యము లుండుటే ఒకవిధముగా ప్రపంచ యుద్ధములకు కారణమని వారి ఉద్దేశ్యము. ప్రస్తుత పరిస్థితులను సరిగా అవగాహన చేసుకున్న, వలసరాజ్య విధానము వుండుటచే ప్రపంచశాంతి వుండనేరదు. ప్రతిదేశమునను అభ్యుదయమును తీసుకొనిరావలెనని వీరు చెప్పుదురు. మొన్నమొన్నటివరకు దేశ పరిపాలనావిధానములో దేశీయులకు క్రియమైన శిక్షణ, తర్ఫీదు యివ్వలేదు. ఈమధ్యనే యీ విషయములో కొంత మార్పు కానవచ్చుచున్నది. యిప్పటికిని వలసరాజ్య విధానముచే ఆక్రమింపబడిన దేశములలో విద్యాభ్యాసము పూర్తిగా ప్రవేశపెట్టబడలేదు.

ఇటువంటివన్నిటిని మార్పుచెయ్యవలెనంటే ఎటువంటివిధానము అవలంబించవలెనో తెలియవచ్చుటలేదు.

వలసరాజ్యవిధానము నాల్గు వందల సంవత్సరముల క్రితమే అమలులోనికివచ్చెను. యీ విధానఫలితముగా ఐరోపాలోని వివిధ ప్రజలు వివిధ భూభాగములను ఆక్రమించి వలసవిధానము అమలులో పెట్టి ఆ రాజ్యములను పిప్పిపిప్పి జేయుచుండెను. వలసరాజ్యములు ఒక్కొక్కరాజ్యమునకు ఇచ్చి యుండవచ్చునా అనెడి సమస్యమీదే యీరెండు ప్రపంచయుద్ధములు జరిగినవి. మరి దీనికి ఇతర కారణము లున్నప్పటికిని వలస రాజ్యములు వుండుటవలన వ్యాపారము వృద్ధిచేసుకొనుటకు వీలుఅగును. ఏ యే దేశములకు వలసరాజ్యములు సరిగ్గా లేవో ఆ దేశములు ఎల్లప్పుడు పగజెంది సరియైన సమయముకొరకు వేచియుండుట మనకు తెలిసిన సంగతియే. "వలస రాజ్యములు" అనెడి శీర్షిక క్రింద 17వ శతాబ్దమునుండి ఐరోపాలోని యుద్ధములు పోరాడబడినవని చరిత్రకారులు చెప్పుదురు.

వలసరాజ్యములలో పరిశ్రమలు అమలులో పెట్టబడలేదు. పరిశ్రమలు అమలులోపెట్టిన సామ్రాజ్య దేశముల వ్యాపారము దెబ్బతిలేదు. ఈ రోజువరకు కూడా వలస రాజ్యములలో నిరక్షరాస్యత పూర్తిగా తీసివేయబడలేదు. ఈ పుస్తకమందు ఇండొనేషియా స్వాతంత్ర్య పోరాటమునుగూర్చి యోచింతము.

# చరిత్ర

క్రీ. శ. ఒకటవ లేక రెండవ శతాబ్దములలో హిందూదేశము నుండి కొద్దిమంది బౌద్ధ సన్యాసులు ఇండోనేషియాకు పయనమై అక్కడ బౌద్ధ మతమును, దాని సాంప్రదాయమును నాటుటకు పూనుకొనిరి. బౌద్ధ మత కలయికచే ఇండోనేషియా నాగరికతలో మార్పు వచ్చెను. యీ మార్పు ఫలితముగా ఇండోనేషియాలో శ్రీవిజయసామ్రాజ్యము స్థాపింపబడెను. ఈ సామ్రాజ్యమునకు దక్షిణ సుమిత్రాలోవున్న సాతెంబాంగ్ (శ్రీ విజయ) అను పట్టణము రాజధానిగా వుండెను. 5 లేక 6 శతాబ్దములలో సుమిత్రాలో బౌద్ధమతము పూర్తిగా వ్యాపించి అక్కడవున్న కొద్దిమంది హిందూ మతస్థులుకూడా బౌద్ధమతమును స్వీకరించిరి. మొదటిలో శ్రీ విజయ సామ్రాజ్యము సుమిత్రాలోనే స్థాపింపబడి నప్పటికిని నెమ్మదినెమ్మదిగా యీ సామ్రాజ్యము మలయా, బోర్నియో, సెలిబీస్, ఫార్మోసాలో సగము, ఫిలిప్పైన్స్ తదితర దేశములకును వ్యాపించినది. వ్యాపారము, ఓడలుకట్టుట యీ సామ్రాజ్యముయొక్క వృత్తులలో ముఖ్యమైనవి. దక్షిణ హిందూదేశములో చోళులు మహోన్నతదశ ననుభవించుచున్నపుడు శ్రీ విజయ సామ్రాజ్యము కూడా ఉన్నతదశ ననుభవించు చుండెను. చివరికి 1377 వ సంవత్సరములో శ్రీ విజయ సామ్రాజ్యము క్షీణించి మొజ్జాపాహిత్ సామ్రాజ్యము

నకు స్థానమిచ్చెను. శ్రీ విజయసామ్రాజ్యము బాగుగా వ్యాపించినప్పటికిని జావాలో సగముమాత్రము విడిగా వుండిపోయి అక్కడి ప్రజలు బౌద్ధులు అగుటకు సిద్ధపడ లేదు. ఆ ప్రదేశములోవున్న ప్రజల వృత్తులుకూడా ఓడలుకట్టుట, వ్యాపారము మొదలైనవి. ఈ కారణము వలనను యీ రెండు ప్రాంతముల వారికిని బద్ధ వైరము సమరసిల్లెను. 1377 వ సంవత్సరమున యీ సామ్రాజ్యము పూర్తిగా క్షీణించిపోయెను.

శ్రీ విజయసామ్రాజ్య పరిపాలన మూడు పుస్తకములమీద ఆధారపడియుండెడిది. 1. కామందక రాజు యొక్క నియుక్తవిధులను తెలిపెడి పుస్తకము 2. ఇంద్ర జాలము అనెడి రాజకీయశాస్త్రము 3. నీతిప్రియ. పరాజయముపొందిన రాజులను ఏ విధముగా గౌరవించవలెనో తెలిపెడిది. కాళిదాసుని పుస్తకములకు, రామాయణము, మహాభారతములు కూడా ఇండొనేషియా భాషలోనికి తర్జుమా చేయబడినవి. అక్కడ కాన్పడిన సంస్కృత శాసనములనుబట్టి చూడగా హిందూదేశముయొక్క సాహిత్యము, భాష, మత, సంఘ రాజకీయములు ఇండొనేషియాలో ప్రవేశించి ఆ దేశములో మార్పులకు హేతుభూతమయినవిగా కాన్పడును.

15 వ శతాబ్దమునకు పూర్వమే అరబ్బీయులు, ఆ దేశముతో వ్యాపారముచేయుచుండిరి. క్రమముగా అక్కడ వలసరాజ్యములను ఏర్పరచిరి. 1111 వ సం॥లో

మొదటిసారి ఇండోనేషియనులలో కొంతమంది మహమ్మదీయ మతమును స్వీకరించిరి. 1205 వ నాటికి అక్జాలో మొదటి మహమ్మదీయ రాజ్యము స్థాపింపబడెను. జోహార్‌షా అనెడు ఆయన ఆ రాజ్యమునకు మొదటి రాజు. ఈ రోజున ఇండోనేషియనులలో 90 0/0 మహమ్మదీయులు; మిగతావారు హిందువులు, క్రిష్టియన్లు, తదితరులు.

ఇండోనేషియా పంటలు ఐరోపావారిని ఆసియా వారిని కూడా చాలాకాలమునుండి ఆకర్షించుచుండెడివి. ఇక్కడ పంటలను సంపాదించుకొనుటకు ఐరోపావారు రాకపూర్వమే హిందూదేశీయులు, అరబ్బీయులు, జపాన్‌వారు ఇండోనేషియాకు వచ్చిరి. ఐరోపియనులలో మొదట వచ్చినవారు పోర్చుగీసువారు (16 శతాబ్దము) స్పెయిన్‌వారు, ఫ్రెంచివారు, 1592 లో డచ్చివారు, 17 వ శతాబ్దములో ఇంగ్లీషువారు.

వ్యాపారస్థులుగా వచ్చుటచే వారిని ఇండోనేషియనులు గౌరవించిరి. కాని ఎప్పుడైతే వారు యీ దేశములోని మత, రాజకీయ సమస్యలలో జోక్యము కలుగజేసుకొన మొదలిడిరో వారిని గౌరవించుట భావ్యము కాదనుకొనిరి. కనుక దేశస్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుటకు ఎన్నియో యుద్ధములను ఇండోనేషియనులు చేయవలసి వచ్చెను.

పోర్చుగీసువారు వ్యాపారమేకాక దేశములోని ప్రజలను క్రైస్తవ మతములో కలుపుటకు ప్రయత్నము చేసెడివారు, వారిని చెండాడి యెవరికి వారికి ప్రాతినిధ్యము లేకుండా చేసిరి. తదుపరి డచ్చివారు వచ్చిరి, ముందు వారుకూడా గౌరవింపబడినవారే. డచ్చివారు వచ్చిన పిదప వ్యాపారములో పోటీ ఎక్కువగా వుండుట వల్ల ఇండొనేషియనులకు లాభకరముగా నుండెను, ఇదియేగాక డచ్చివారి సహాయముతో పోర్చుగీసువారిని తరిమివేయుటకు ఇండొనేషియనులు ప్రయత్నించిరి. ఈ కారణములవల్ల డచ్చివారికి త్వరగా స్థానము దొరికెను, కాని డచ్చివారుకూడా దేశరాజకీయములలో జోక్యము కలుగజేసుకొన మొదలిడిరి. కొన్ని కొన్ని ప్రాంతముల యందు వారి రాజ్యమును కూడా స్థాపించుటకు ప్రయత్నము జేసిరి. పూర్తిగా ఇండొనేషియా వ్యాపారము వారి వశము జేసుకొన దలచిరి. ఈ కారణమువలన డచ్చివారికి పోర్చుగీసువారే కాక తదితరులు కూడా శత్రువులైరి.

1595 నాటికే డచ్చివారు ఇండొనేషియాతో వ్యాపారము చేయుటకు సంసిద్ధులైరి. 1602 సంవత్సరములో డచ్చివారు తమ వ్యాపారసంస్థను స్థాపించిరి. ఈ సంస్థకు మూలపురుషుడు జాన్ పీటర్సు, ఈ కంపెనీ ఉద్యోగి ఒక లేఖ వ్రాయుచూ ఇండొనేషియా Emerald Islands వజ్రద్వీపములనియు,యీ

దేశముతో వ్యాపార బాంధవ్యములను కలుగజేసుకొని నచో ఎంతయో లాభకరముగావుండునని వ్రాసెను. జాన్ పేటర్సు వచ్చిన రోజులలో దేశమంతటా జమీందారులు వుండెడివారు. వీరిలో వీరికి కక్షలు. 1603 సం॥లో జాన్ పీటర్సు ఒక సైన్యమును తయారు చేసి, తన పనివారి రక్షణార్థమై అని చెప్పుచూ, స్థానిక రాజకీయములలో జోక్యము కల్గుచేసుకొని నెమ్మదిగా ఒక జమీందారి తరువాత మరియొక దానిని కబళించి వేయుచుండెను. 200 సంవత్సరములలో వ్యాపారములో వచ్చు లాభము 50% ఆయెను. అప్పటికి ఇండోనేషియాలో ఒక్క ప్రదేశముమాత్రమే వారి వశమందుండెను. ఆ దేశముపేరు జాకర్తా. కొద్దికాలములో యింకను ప్రదేశములను సంపాదించిరి. 1607 అయినపిదప ఒక రాజప్రతినిధి నియమింపబడెను. పూర్వము ఫ్యాక్టరీలనే స్థాపించిరి. తదుపరి ప్రదేశములను కవులుకు పుచ్చుకొనుట నారంభించిరి. జావాలోని "రాజులు" కప్పములు కట్టుట మొదలెట్టిరి. అక్కడి వ్యాపారమంతా ఇండోనేషియనుల చేతులలో నుండెడిది. 17 వ శతాబ్దము చివరికి పోర్చుగీసువారిని, స్పెయిన్ వారిని తరిమి వేసినపిదప ఒక సామ్రాజ్యమును డచ్చివారు స్థాపించిరి.

భూస్వామిక పద్ధతివల్ల డచ్చివారు దేశపు ప్రభువులు. అందువలన దేశములోనివారు కొన్నికొన్ని పనులను కూలినాలి లేకుండగనే ప్రభుత్వమువారికి చేయవల

యును. దానిలో ఒకటి భూసేవ్యము. కంపెనీవారు అన్ని విధములైన సుగంధద్రవ్యములను అక్కడ పండించి దేశములోని ప్రజలు ఎవ్వరూగూడా యీ సుగంధద్రవ్యములను పండించ కూడదని చట్టముచేసిరి. ఈ విధముగా ఇండోనేషియాయొక్క వ్యాపారమును నాశనము చేసిరి. ఈ చట్టములను ఆచరణలో పెట్టుటకు ప్రజల సహకారము కాన్పడలేదు. 1798 లో కంపెనీకి నష్టము వచ్చి కంపెనీ మూసివేయబడెను. మిగతా యూరపియన్లతో యుద్ధము చేయుటకు యెంతయో డబ్బు కావలసియుండెను. ఈ కంపెనీయొక్క లాభములు యుద్ధముల ఖర్చుక్రింద సరిపోకుండుటచే కంపెనీ మూయబడి నష్టము క్రింద యీ కంపెనీ డచ్చిరిపబ్లిక్ వారివశము చేయబడెను. 1807 లో ఒక కమీషను వేసిరి. ఆ కమీషన్ వారు పూర్వపు పద్ధతులనే అమలులో పెట్టుమని సలహానిచ్చిరి. 1811 వ సంవత్సరములో డచ్చిదేశమును ఫ్రెంచివారు వశము చేసుకొనిరి. అదే సంవత్సరములో ఇండోనేషియాను ఇంగ్లీషువారు వశము చేసుకొనిరి. ఇండియా రాజప్రతినిధి అప్పుడు స్టాంఫర్డ్ రాఫల్స్ అనెడువానిని పంపి పోలీసు, తదితర శాఖలలో కొన్ని మార్పులను ప్రవేశపెట్టెను. పంటలో సగభాగము పన్నుక్రింద చెల్లించ వలసినదిగా చట్టము చేయబడెను. ఇది పూర్వపు పద్ధతి మీద వచ్చిన గొప్ప మార్పు, లాభము!

1814 సంధిషరతుల ప్రకారము ఇండొనేషియాను తిరిగి డచ్చివారికి ఇంగ్లీషువారు యిచ్చివేసిరి. ఈ రోజున మరల ఇంగ్లీషువారు చేయుచున్న పనులను పట్టిచూడగా 131 సంవత్సరములు అయినపిదప మరల యీ పనిని సాధించుటకు ఇంగ్లీషువారు ప్రయత్నము చేయుచున్నట్లు గోచరమగును. 1818 నాటికి డచ్చి ప్రభుత్వము పూర్తిగా స్థాపింపబడెను. పరిపాలనా విధానము ఏవిధముగా నుండెడిదో యీ క్రింద ఉదహరించిన విషయములనుబట్టి విశదమగును. ప్రైవేటుగా పంటలు పండించుకొనుటకు సంస్థలు స్థాపించుకొనుటకు చట్టములు చేయబడినవి. అటువంటి సంస్థలలో ఇండొనేషియనులు చేయికల్పుటకు వీలులేదు. అందువలన పెద్దవ్యాపారము పేరిట ప్రజాసామాన్యము హింసింపబడెను. గవర్నమెంటు తరఫున ఎగుమతులు చేయుటకు నెథర్‌లాండ్స్ ట్రేడింగ్ కంపెనీ ఒక్కదానికే గుత్త యివ్వబడెను.

ఇంతలో ఇంగ్లండులో వచ్చిన పారిశ్రామిక విప్లవ ఫలితముగా డచ్చివారు వారి పద్ధతులను మార్పుజేసుకొనవలసివచ్చెను. అందువలన ఆకాలమునుండి 2/3 వంతు దిగుమతులు డచ్చివారు చేయుచూవచ్చిరి. దీనికి ఫలితముగా ఇండొనేషియాలోని ప్రజాసామాన్యము, ధనికులు కూడా నాశనము కాబడిరి.

డచ్చివారి వలససిద్ధాంతములు ఇండొనేషియాలో నచ్చలేదు. 1830 నాటినుండి వలసరాజ్యముల బడ్జెటులో

పెద్ద తొర్ర కాన్పడెను. 1825-30 లోపల డచ్చివారు మధ్యజావాలో యుద్ధములు చేయవలసివచ్చెను. 1821-38 సంవత్సరముల ప్రాంతములో సుమిత్రా ప్రజలతో యుద్ధములు చేయవలసి వచ్చెను. 1830 లో బెల్జియమ్‌ను, హాలెండును విడిచిరి.

ఈ యుద్ధముల జేయుటవల్ల బడ్జెటులో తొర్ర కాన్పడుట చేతను, బెల్జియమ్ విడిచి వేయబడుట చేతను హాలెండు రాజు తన వలసరాజ్యమంత్రియైన బౌడ్ సలహా ననుసరించి వాన్ డెన్ బాస్కు అనువానిని ఇండొనేషియాకు పంపబడెను. ఇతను ప్రవేశపెట్టిన విధానమునకే Culture System అని పేరు. ఏ గ్రామములో వున్న భూమిలో 1/5 వంతు భూమిలో ప్రభుత్వపు ఉత్తర్వు ననుసరించి పంటలు పండించిన ఆ గ్రామము ప్రభుత్వమునకు పన్నుల కట్టనవసరములేదని తెలిపెను. ఈ ప్రదేశములో పండించిన పంటలో రైతుకు ఏ హక్కుయును లేదు. ఆ పంట ప్రభుత్వమునకే జెందును. ఈ పంటను ఎగుమతి చేసి ఎంతయైనను లాభము ప్రభుత్వము పొందవచ్చును. 1831 వ సంవత్సరములో డచ్చి ప్రభుత్వమునకు ఇండొనేషియనుల డబ్బును కొంత బట్వాడా చేసెను. ఈ విధముగావచ్చిన డబ్బుపెట్టి డచ్చివారు దేశమున పెద్దపెద్ద రైల్వేలు, తదితర ప్రజాసౌకర్యములకు అవుసరమైన కొన్ని సంస్థలను కట్టుటలో వినియోగించిరి.

భూసంబంధ చట్టముల సహాయముతో ప్రజలు యింకను బాధింపబడిరి. ఆచట్టము ప్రకారము దేశము లోని పంటభూములన్నియు ప్రభుత్వమునకు జెందును. కాని ఆ భూములయందు పండే పంటమాత్రము సేవ్యదారునిది. ఈ సేవ్యదారుడు తనపంటలో కొంతభాగము నిచ్చి కూలినాలి లేకుండా ప్రతి అయిదు రోజులలో ఒక రోజు కూలినాలి లేకుండగా పనిచేయుట ఒక మామూలు ఆయెను. ఈ చట్టమును డచ్చివారుకూడా అమలులో నుంచిరి. కాని వారములోని రోజులనుమాత్రము ఐదు రోజులకు పొడిగించిరి· అయినను భూమిమీాద వృత్తిమట్టుకు మామూలే. ఈ విధముగా డబ్బు యివ్వనక్కరలేని సేవ కుల సహాయముతో రోడ్లు వేయుట, కాలువలను త్రవ్వుట, తోటలను వేయుటకొరకు ఉపయోగింపబడినది. ఒకరోడ్డు వేయవలెనని ప్రభుత్వమునకు ఉద్దేశమున్నచో చుట్టు పక్కలవున్న వూళ్లవారు కొద్దికొద్దిగా రోడ్లను వేసి అంత రోడ్డును వేయవలెను. ఈవిధముగా వారు చేయుటకు తిరస్కరించిన యెడల శక్తి సామర్థ్యములుగల వయో జన, వృద్ధులను ఉరితీయించెడివారు. ఈ పరిపాలనకు పూర్వపు కంపెనీ పరిపాలనకు తేడా యేమాత్రము కాన రాదు. కంపెనీవారు పరిపాలించుచున్న రోజులలో వచ్చిన లాభములు కంపెనీ భాగస్వాములు కొద్దిమందికే చెందె డివి. కాని యిప్పుడా ప్రభుత్వపు కోశాగారములోనికి యీడబ్బంతా ప్రవహించును.

పైన ఉదహరించిన కల్చర్ విధానము అమలు లోనికి వచ్చినపిదప లాభములు ఎక్కువాయెను. 1/5 వంతు పంట భూమిలో ఖర్చు ఏమియు లేకుండ పంటలు ప్రభుత్వమునకు పండించి పెట్టుటాయెను. ఈ విధముగా పండిన పంటను డచ్చిఓడఃమీాదనే హాలెండుకు రవాణా చేయవలెను. ఈ ముడి సరుకులు అక్కడ ఫ్యాక్టరీలలో నింపి ఆ సరుకులనే మరల ఈ దేశమునకు పంపించి యీావిధముగా ప్రభుత్వము వ్యాపారము చేయుటవలన 1877 వ సం॥ నాటికి వలసరాజ్యముల బడ్జెటులో నిల్వలు కన్పడెను. పూర్వపు రోజులవలె మరల Amsterdam ప్రపంచ ప్రధాన వ్యాపార ప్రదేశములో ఒకటిగా నిల బడెను. ఈ పద్ధతికే "బేటింగ్ స్లాట్" అని పేరు. 1877 వ సంవత్సరమునకు 832 మిలియన్ల గిల్డర్లు ప్రభుత్వమునకు లాభముగా ఆదాయములో నిల్వగా వుండిపోయెను. 1877 తరువాత యీా విధానములో మరల మార్పు వచ్చెను.

1848 లో ఐరోపాలో విప్లవపు ఫలితముగా డచ్చి వారు తమ వలసరాజ్యములలో కొన్ని మార్పులను తీసు కొని రావలసి వచ్చెను. దీనికి ఫలితముగా 1854 లో ఇండొనేషియా, తదితర వలసరాజ్యములలో భూములను ఏదేశస్థులకు అమ్మకూడదని చట్టము చేసిరి. కాని 1870 వరకు కూడా పూర్వపు పద్ధతియే బాగుగా అమలులో వుండెడిది. కాని తమపరి మిరియము, ఇండిగో తదితర

వంటలవల్ల ఎక్కువ లాభము కనపడలేదు. కాన యీ పద్ధతి మారిపోయెను. పేరుకు చట్టముగా యీ కల్చర్ విధానము అమలులో లేనప్పటికిని 1890 వరకు పంచదార తోటలు, 1915 వరకు కాఫీతోటలుండెడివి. ఇల్లు పదిల మగుటచేతను, ఈతోటలనుండి ఎక్కువ లాభములు లేకుండుటవల్లను ఈ కల్చర్ విధానము స్వాభావికముగానే రద్దు ఐపోయెను. 1878 లో మరియొకవలసరాజ్యమంత్రి దీనాల్ అనెడివాడు మరియొక పద్ధతిని అమలులోనికి తెచ్చెను. అది ఏమన పెద్దపెద్ద తోటలను ఐరోపాదేశీయులకు కవులుకిచ్చుట, ఈ పద్ధతి ఫలితముగా ప్రైవేటు వ్యాపారము, ప్రైవేటు ఎస్టేటులు కానరావచ్చెను.

ఈ పెద్దతోటలకు కూలీలు అవసరముగాన 1880 లో కూలీల చట్టమొకటి ప్యాసుచేయబడెను. ఈ చట్టము ప్రకారము కూలివారు కొన్ని సంవత్సరముల వరకు ఒక తోటమీద పనిచేసెదమని వ్రాసి యివ్వవలెను. ఈ నియుక్తకాలపు మధ్యలో యీ తోటను వదలివేసినయెడల కారాగారవాసముగాని, జుల్మానాగాని లేక రెండుగాని లేక నియుక్తకాలము అయ్యెడివరకు ఆతోటలోనే ఒత్తిడిచేసి తిరిగి పనిచేయించుట,యివిశిక్షలు, బానిసవ్యాపారము కొన్ని దేశములలో వుండెడిది. అటువంటిదే యీ విధానముగూడా. కాని డచ్చిప్రభుత్వము పూర్తిగా శాంతి నెలకొల్పి యీ పద్ధతి నమలులో పెట్టుకాలమునకు ప్రజలలో అశాంతి ప్రబలి రాజకీయ చైతన్యము కలిగెను.

# జాతీయ రాజకీయ చైతన్యము

ఇండొనేషియాలో జాతీయ ధనిక వర్గము కానరాదు. ఆ కారణము చేత యంత్ర పరిశ్రమలు తక్కువ. వీటిలో పనిచేయు కూలీలుకూడా యింకా తక్కువ. పూర్వము అనాధ శరణాలయములు, క్లబ్బులు వుండెడివి. కాని వీటిలో సభ్యులు కుటుంబములో వున్నవారు, మరికొందరు మిత్రులు. వీటిస్థాపనకు కారణము సంతోషముగా కాలము వెళ్ళబుచ్చుట మాత్రమే. ఇప్పటిలాగా అవి రాజకీయ సంస్థలు కాదు. సాంఘికమైనవి మాత్రమే. ప్రజలు ప్రభుత్వపుభయముచే తలవంచుకొని ఏమిచెప్పిన అది చేసెడివారు. ఇష్టము లేకపోయినప్పటికిని బైటకువెల్లడి చేసెడువారుకాదు. ఏమన్నా చెప్పినయెడల అది సంఘనీతులను తిరస్కరించినదగును. అంతియే కాక ప్రజా సామాన్యముయొక్క మొరలను వినుటకు ప్రభుత్వములో ఎవరునూ కానరారు.

పూర్వము ఇండొనేషియా ప్రజలలో మూడువర్గములు వుండెడివి. 1. దచ్చివారు 2. ప్రభుత్వోద్యోగులు 3. ప్రజాసామాన్యము. వీటిలోని తేడాలు ఈ క్రింద వివరించబడినది.

డచ్చివారు పరిభువులు; అందువలన ప్రభుత్వో ద్యోగులకు, ప్రజాసామాన్యమునకు మించినవారు. ప్రభుత్వోద్యోగులు పరిభువులకన్న ఒక మెట్టు తక్కువైనప్పటికిని వారిని ప్రజాసామాన్యము గౌరవించవలసినదే! ప్రజాసామాన్యపు విషయమా. వారు పైవారు ఏమి చెప్పినను తిరిగిజవాబు చెప్పకుండా చేయవలెను. పై రెండు వర్గములలో ఎవరైనా ముందునిలబడియున్న ప్రజాసామాన్యము సాష్టాంగపడి ప్రమాణము చేయవలెను. అందరికన్నవారు హీనులని యీవిధముగా ప్రవర్తించి నిరూపించవలెను.

ఈ శతాబ్దము మొదటి పదిసంవత్సరములలో కట్టుబడియుండి యున్న ఒక్క ప్రజాచైతన్యము కానవగును. 1905 లో రష్యావారిని జపానువారు ఓడించుట, 1912 లో లో చైనా రిపబ్లిక్‌ను స్థాపించుట, 1917 లో రష్యాలో ప్రజావిప్లవము, ఫిలిప్పైన్సు ఇండియాస్థితిగతులలో మార్పు, యివి యన్నియు చేకూడి ఇండోనేషియనులలో చైతన్యము కల్గించెను. మతరీత్యా ఎక్కువ మార్పుకు హేతుభూతమైన దేశములు ఈజిప్ట్, అరేబియా.

రష్యా, జపాను యుద్ధపూర్వము రోజులలో తూర్పు దిశ ప్రజలు అనిన పశ్చిమ వాసులు ఒకవిధమైన హేళనతో చూచెడివారు. ఆ రోజులలో ఇండోనేషియనులు యేవిధమైన రాజకీయ అలజడిలో పాల్గొనుటకు వీలు లేదాయె. కాని, ఏ రోజున జపాన్ వారు రష్యావారిని ఓడిం

చిరో అప్పుడు పశ్చిమవాసులు తమ అభిప్రాయములను మార్చుకొనవలసివచ్చెను. ఆ దేసమయములో ఆసియా వాసులు తమ హక్కులను గుర్తెరింగిరి.

పత్రికలద్వారా కొద్దిమంది ఐరోపావాసీయులు తమ తమ అభిప్రాయములను వెళ్ళబుచ్చుచువచ్చిరి. 1854 సం॥పు చట్టప్రకారము ఎక్కడనూ సభ పెట్టుటకు వీలులేదు. 1908 నాటికి చట్టములలో చాలా మార్పులు వచ్చెను. 1908 సం॥ చట్టప్రకారము కేంద్రీకరణ ప్రభుత్వము తీసివేసి చిన్నచిన్న జిల్లాలుగా దేశమును విభజించి ప్రభుత్వము నెలకొల్పిరి. నగర సంఘములు స్థాపింపబడినవి. ఈ నగర సంఘములకు కొన్నికొన్ని పనులను నియుక్తము చేసిరి. రాజకీయములలో ప్రజలు పాల్గొన వచ్చును — ఎంతవరకు ? — ప్రభుత్వముచే స్థాపింపబడిన యీ నగర సంఘములలో పాల్గొనుటవరకే ! 1908 సం॥న ఐరోపావాసీయులకు ఓటు హక్కు నిచ్చిరి. ఈ విధముగా యూరపియనుల ప్రచారముచేత యీ సంస్కరణము అమలులోనికి వచ్చినదగుటచే దేశములోని ప్రజలకు కొంతమందికి యిది ఆ దర్శప్రాయమైనది.

19 వ శతాబ్దములో విద్యావిధానము అమలులో పెట్టుటకు ప్రభుత్వము పూనుకొన లేదు. "విద్యావిహీనః పశుః" అను సంస్కృత లోకోక్తి అందరికి తెలిసినదియే. విద్యాభ్యాసము నిచ్చిన మరల వారిలో రాజకీయచైతన్యము, జాతీయత నశించు

నామె. ఈ చైతన్యము యేవిధముగా వచ్చును? పుస్తక ములను చదువుట, చరిత్రను అవగాహన, అర్థము చేసుకొనుట, ప్రపంచమందలి యేయే దేశములలో యేయేవిధములుగా అభ్యుదయమువచ్చినదో తెలిసికొను టకు యివియన్నియు సాధనములు. వీటన్నిటికి మించినది మరియొకటి వున్నది. స్వాతంత్ర్యమును అనుభవించు చున్న ప్రజలతో కలయికచే స్వాతంత్ర్యము అనుభవిం చుటచే వచ్చులాభ నష్టములుకూడా అవగాహన యగు టకు వీలునిచ్చును.

1895 వ సంవత్సరములో 16 సంవత్సరముల బాలిక "కార్తినీ" అను నామె పైచదువు అను పేరిట గృహమును వదలివేసి బటేవియాకు ప్రయాణమయ్యెను. ఈవిధముగా ప్రవర్తించుట పూర్వపు అలవాట్లను అతిక్రమించుటయే. అక్కడ డచ్చిజాతికి చెందిన ఒక పెద్ద ఉద్యోగస్థునితో ఆమె బసచేసెను. విద్యనభ్యసించు ట పూర్తియైనపిదప ఆమె తన జీవితమును సంఘ సంస్క రణకు వినియోగింప నిశ్చయించుకొనెను. అభ్యుదయము నకు హేతు భూతమగు ఏవిషయములు నేర్చుకొనుటకును దేశములో విద్యాసంస్థ లేదయ్యెను. కనుక యీకొరత తీర్చి వేయు వుద్దేశముతో స్త్రీలకొరకు ఒక విద్యాసంస్థను స్థాపించి, ఆసంస్థను పోషించుటకు తన శాయశక్తులా పని చేసెను. స్త్రీలకు విద్యనిచ్చినచో కోటానకోట్లప్రజలకు విద్యనిచ్చుట అని ఆమె ఉద్ఘాటించుచుండెను.

మొట్టమొదటిసారి వైద్యశాలలోని విద్యార్థులు ఒక తాఖీదును క్రిందస్కూళ్ళకు పంపి విద్యార్థి సంఘమును ఒకదానిని నెలకొల్పుటకు ప్రయత్నించిరి. ఈప్రయత్నము పూర్తికాక పూర్వమే ఒక పెన్షను తీసుకొనిన వైద్యుడు జావాలో 1906-7 సంవత్సరములలో నలుమూలలు తిరిగి జాతీయవిద్యకొరకు ఒక మూలనిధిని వసూలుచేసి, ఇండోనేషియనులను బైట దేశములకుపంపి విద్యను అభ్యసించుటకు పూనుకొనవలసినదిగా ప్రచారముచేసెను. మిగతా దేశములకన్న వెనుకంజవేసియున్నా మనెడి జ్ఞానము కొంతమందిని ముందుకు నెట్టినది. ఈవైద్యునిపేరు డా. వైదాన్ సోయెదీరా ఓయసా. ఈవిద్యార్థులకృషివల్ల ఈ వైద్యునివల్ల "బోయెదా ఓయూటమో" అనెడి ఒకఇండోనేషియను సంస్థ నెలకొల్పబడెను. ఈ సంస్థయొక్క ముఖ్యోద్దేశము జావాయొక్క ఆర్థిక, సాంఘిక, రాజకీయ సంస్కరణ. ఇంతవరకు నివురు కప్పిన నిప్పువలె వుండియున్న ద్వేషము బైటికిపొంగెను. 1908 వ సం॥లో ప్రథమ మహాసభ జరిగెను. ఈవిధముగా జావా దేశస్థులజాతీయత వెల్లడిచేయబడెను. ఈ మహాసభకు ఆ సంవత్సరములోపలే 10,000 ప్రజల పైగా సభ్యులుగా జేరిరి. దీనిలో ప్రజాసామాన్యము యెక్కువగా పాల్గొనలేదు. రాజకీయసంస్థగానే కాకుండా యీ సంస్థ కొత్తకొత్త స్కూళ్ళనుబెట్టి ప్రజలలో విద్యను అభి

వృద్ధి చేయుటకు పూనుకొనెను. ప్రజలలో చాలామంది మహమ్మదీయులు. వారికిమతము ముఖ్యము. అందువలన యీ ఆశయములు నచ్చలేదు. కనుక యీ కృషి మరియొకసంస్థ చేపట్టవలసివచ్చెను.

ఈ నాటికి ఆర్థికముగా దేశమును ప్రభుత్వము పీల్చి పిప్పిచేసివేసెను. వ్యాపారములో దొరల పోటీ ఎక్కువయ్యెను. దానికిఫలితముగా ఆర్థికసంస్థలను ప్రజలు స్థాపించిరి. 1909 లో మహమ్మదీయ వాణిజ్యసంస్థను స్థాపించిరి. కొద్దిరోజులలో ప్రజలు అతిఉత్సాహముతో సహకారము చేయుటకు సంసిద్ధులైరి. ఈ సంస్థకే 1912 లో "సారికత్ ఇస్లామ్" అని నామమిడిరి. ఈసంస్థయే చాలకాలము ఇండోనేషియాయొక్క రాజకీయములలో ప్రధానపాత్రవహించెను. మతైక్యత, ఆర్థికసహాయము యీ సంఘముయొక్క ముఖ్యోద్దేశములు. అందువలన యీ సంస్థ సహకార పరపతి సంఘములను నెలకొల్పి ప్రజలకు సహాయము చేయుచూవచ్చెను కాని 1912 వ సంవత్సరములో యీ సంఘములో సభ్యులుగా వున్న వారు కొంతమంది ముఖ్యపట్టణములలో సమ్మెలు చేయుటచే ప్రభుత్వము ఈ సంస్థను నిషేధించెను. కొద్దికాలములోనే యీనిషేధము తొలగింపబడినది. తదుపరి పూర్వముకన్న ఎక్కువవికాసముతో ఈసంస్థ మరల స్థాపింపబడెను.

19.6 వ సంవత్సరము వరకు ప్రెస్సుఆక్టు ననుసరించి పత్రికల ప్రకటనముందర ప్రభుత్వము అనుమతి

పొందవలసియుండెను. కాని యీ సంవత్సరములో ఆ చట్టములో మార్పు తీసుకొనిరాబడెను. ఆమార్పు ననుసరించి యికముందు ప్రభుత్వముయొక్క అనుమతి పొందకుండనే ప్రచురించవచ్చునుగాని, యెప్పుడైనా ప్రభుత్వమును పడద్రోయవలెననెడి ఉద్దేశ్యముతో యేవిధమైన వార్తలు ప్రచురించినను ధరావతు గోల్పోవునట్టుగా మార్పుతీసుకొనిరాబడెను. అందువలన కొంతవరకు ప్రజల కష్టనిష్ఠూర్యములను పత్రికలద్వారా వెల్లడిచేయుటకు అవకాశము చిక్కెను.

ఇండియాలో బ్రిటీషువారివలెనే డచ్చివారుకూడ తామే ఇండోనేషియాకు సంస్కృతి, నాగరికతలను కొని తెచ్చితిమని సిగ్గులేకుండ చెప్పుకొనజొచ్చిరి. ఆ దేశ ప్రజలమీద దయ, ప్రేమల ఫలితముగ వైద్యసౌకర్యములను కలిగించితిమనియు, యింక మలేరియాను గురించి భయపడనక్కరలేదనియు చెప్పజొచ్చిరి. ఈ క్రిందిపట్టిక 30 సంవత్సరములో, డచ్చివారి 200 సం॥ల పరిపాలనా కాలములో, తయారైన వైద్యుల సంఖ్యను తెలియజేయును.

| సంవత్సరము | ఐరోపియనులు | ఇండోనేషియన్లు |
|---|---|---|
| 1900 | 103 | 90 |
| 1910 | 145 | 83 |
| 1920 | 301 | 445 |
| 1930 | 667 | |

4,10,00.000 మంది ప్రజలకు 667 మంది డాక్టర్లు! ఇది వారి వైద్యసహాయం! దాదాపు 1913 వరకు వైద్య కళాశాలయే లేదు!

1913 మరల ఒక మహాసభ జరుపబడెను. ఆ సభలో యీ సంస్థ ముఖ్యోద్దేశ్యములను తెల్పుతూ అధ్యక్షుడు యీవిధముగా నుడివెను.

"ఈ సంస్థ రాజకీయ సంస్థకాదు. సర్వకాలముల యందు ప్రభుత్వమునకు తోడ్పడుచునే యుందుము. పరమతములకు జెందినవారిని హింసించుటకు కూడా యీ సభ నెలకొల్ప బడలేదు."

ఈ సభలో ప్రజాసామాన్యము యెక్కువగా పాల్గొనెను. 25 సంవత్సరములలో 8 లక్షలమంది సభికులు జేరిరి. 1915 వరకు కూడా ఈ సంస్థ రాజకీయములలో చేయిజేసుకొనలేదు. 1916 వ సంవత్సరములో మాత్రము యీ సంస్థ రాజకీయసంస్థగా మారిపోయెను. 1916 వ సంవత్సరములో మరల యీ సంస్థయొక్క మహాసభ ప్రసంగములలో యీవిధముగా చెప్పిరి: "ఈసంస్థ రాజకీయసంస్థ. ఈ సంస్థయొక్క ఆశయము ప్రజాప్రభుత్వము ఇండొనేషియాలో స్థాపింపబడుట." 1917 లో మాత్రము పూర్ణ స్వరాజ్యము యీ సంస్థ యొక్క ఆశయముగా వెలిబుచ్చిరి. 1916 వ సంవత్సరమున ప్రజాసంఘమును ప్రభుత్వము స్థాపించినది. 1916 వ సంవత్సరమున దిహేగ్‌లోని డచ్చిపార్ల

మెంటు ఇండియాకు యే విధముగా ఇంగ్లీషు పార్ల మెంటు జాతీయప్రభుత్వము నెలకొల్పుటకు తోడ్పడుదు మని వెలిబుచ్చెను. ప్రజాసంఘము నెలకొల్పబడినప్పటి కిని ప్రజలకు తృప్తి లేకపోయినది. ఈ ప్రజాసంఘము యొక్క పని రాజప్రతినిధికి బడ్జెటు, మొదలగు విష యములలో సలహా నిచ్చుట. మరు సంవత్సరము నాటికి జారికత్ ఇస్లామ్ ధనికవర్గమును ఒప్పుకొనలేదు. అదే సమయమున విప్లవసంస్థగా మారెను. జోక్రో అనునాతడు మాత్రము చాలా జాగరూకతతో యీ పార్టీని ముం దుకు లాగుకొని వచ్చెను. కాని యీ సంస్థకు నిధి ఎక్కువగా ధనికవర్గమునుంచి వచ్చుచుండెను. అందువలన పరదేశీయ ధనికవర్గము నాశనము కావలెనని యీతడు చెప్పెను. ఈ ప్రజా సంఘములో జారికత్ ఇస్లామునకు స్థానము లేకపోయెను అందువలన రాజప్రతినిధి జోక్రోను నామినేటు చేసెను.

1917 వ సంవత్సరములో జరిగిన జారికత్ ఇస్లామ్ మహాసభలో ప్రకృతము వుండియున్న నాయకులు ప్రభు త్వముచర్చకు లోనైరి. రాష్ట్రములకు యింకా యెక్కు వగా స్వాతంత్ర్యమువుండవలెననియు, ధనికవర్గమును నాశనము చేయుటకు ఎక్కువ కట్టుబాట్లను విధించవలసి నదిగాను తీర్మానములు ప్రతిపాదింపబడెను. ఇదేసమయ మున సామ్యవాదులు హాలెండులో విప్లవము లేవదీసిరి. ఈ మహాసభలో ఎక్కువగా చర్చకు ఆర్థికసమస్య

లను తీసుకొనిరి. జోక్రో ఒక కార్యక్రమమును మహా సభకు ప్రదర్శించెను. కనీస భత్యములు, జీతములు, పని చేయుటకు కాలము తగ్గింపు, స్త్రీ కార్మికులకు సంరక్షణ, పిల్లలను కూలివృత్తినుండి తీసివేయుట, తదితరమైన సంస్కరణలను ప్రభుత్వము అమలులో పెట్టకపోయిన యెడల ప్రభుత్వము తొలగించి మరియొక ప్రభుత్వమును యీమహా సభవారు స్థాపించుటకు నిశ్చయించుకొనిరి.

ఈ రోజులలో హాజీసలీము అనెడి మానవుడు జావా కార్మిక, కర్షక సంఘములను స్థాపించుట ప్రారంభించెను. సలీము కృషివల్ల దేశములో అన్ని సంఘముల వారి మధ్య ఐక్యత ఏర్పడెను. పైనుదహరించిన కార్యక్రమము ప్రజలుత్సాహముతో స్వీకరించిరి. ఆవిధముగా జారీకత్ ఇస్లామ్ యొక్క బలము వృద్ధిపొందినది.

పరిస్థితులు సక్రమముగా లేవు అను ఉద్దేశముతో రాజప్రతినిధి తన సలహాసంఘమును తృప్తిపరచుటకు గాను ప్రభుత్వ విధానములో కొద్ది మార్పులను ప్రవేశ పెట్టుటకు సంసిద్ధుడయ్యెను. (1) 1922 లో డచ్చి పరిపాలనావిధానములో ముఖ్యముగా వలసరాజ్య విషయమై కొన్ని మార్పులను మార్పు చేయుట, ఇకముందు యీ ప్రదేశములు వలస రాజ్యముగా ఉండదని తమ దేశపుసంగతుల విషయమై దేశీయులకు పూర్తిస్వాతంత్ర్యమునిచ్చుట, డచ్చిపార్లమెంటు చట్టములు చేయుటకు ముందు యీ సలహాసంఘముయొక్క అనుమతి తీసుకొను

టకు, (2) 1925లో చట్టమునవరణచేయుటకు, దానిప్రకారము వలన రాజ్యమంత్రికి. రాజప్రతినిధికి యేమిసంబంధము లేకుండవుండుటకు, యీ సలహాసంఘమే కొత్తచట్టముల చేసేలాగుననూ,యీసలహాసంఘములో ఇండోనేషియను ప్రతినిధుల నెక్కువ చేయుటకు, ఇండోనేషియాను రాజధానులుగా విభజించి పరిపాలించుటకు యీ సలహా సంఘముయొక్క సభ్యత్వము 49 నుండి 60 కి పెంచుటకు రాజప్రతినిధి వాగ్దానము చేసెను, కాని ప్రజలను యివి సంతృప్తిపరచలేదు. 60 మంది సలహా సంఘములో సభ్యులుగావున్ననూ దీనిలో ఇండోనేషియను సభ్యులు 25 మందియే కాన యిది అన్యాయమని హాలెండులోని ప్రజలే ఒప్పుకొనిరి. కనుక 1929లో యీ సలహాసంఘములో 30 మంది దేశీయులు సభ్యులుగా వుండుటకువీలుకలుగ జేసిరి. మిగతా ముప్పదిమంది సభ్యులలో 25 మంది ఐరోపావాసులు, నల్గురు చైనావారు, ఒక అరబ్బు.

ఈమార్పులన్నీ చూచిన చాలా బాగుగా వున్నట్లు కన్పడును. నిశిత పరిశీలనచేసి చూచిన యీ సలహాసంస్థ "పైన పటారములోపల లొటారము" అను సామెతకు సహజమైనదగును. రాజప్రతినిధికి వున్న అధికారము, అమెరికాలో వున్న ప్రధాన కార్యనిర్వాహక వర్గమునకు లేదు. రాజప్రతినిధికి సలహాసంఘ మొకటి యున్నది. ప్రతి యిలాకాకు ప్రతినిధిగావున్న ఉద్యోగి

యీ ప్రజల సమితికి బాధ్యుడు కాడు. వారు రాజప్రతినిధికి బాధ్యులు. ప్రజలకు హానికరమైనదని రాజప్రతినిధి తలచిన తీర్మానము ప్రజాసమితి ఆమోదించి నప్పటికిని రాజప్రతినిధి త్రోసివుచ్చవచ్చును. కొన్ని కొన్ని విషయములలో రాజప్రతినిధి ప్రజాసమితి సలహాను తిరస్కరించి తాను చిత్తమువచ్చినట్టుగా ప్రభుత్వము చేయును. అర్డినెన్సు పరిపాలనా విధానము అమలులో వుండును. కొన్ని తీర్మానములను ప్రజాసమితి రెండు మూడుసార్లు త్రిప్పివేసినప్పటికిని రాప్రతినిధి చట్టముగా ప్రవేశపెట్ట వచ్చును. ప్రతి సంవత్సరము బడ్జెటు దిహేగ్‌లోని డచ్చిపార్లమెంటు యొక్క ఆమోదము పొందవలెను. కనుక ఆర్థిక స్వాతంత్ర్యము కూడా కానరాదు. 97.4% వున్న దేశీయులకు 34 స్థానములు, 4% వున్న ఐరోపావాసీయులకు 25 సీట్లు—యీ 30 స్థానములకు ప్రభుత్వముచే నియుక్తమైన నగర సంఘములనుండి ఎన్నిక—20, ప్రభుత్వపు నామినేషన్లు—10. కనుక యీ ప్రజాసమితికూడా ప్రజాస్వామ్యపద్ధతి అవలంబించుట యీ విధముగా వుండెను. కనుక యీ ప్రజాసమితి యిటు యీ ప్రజలకు బాధ్యులు కారు. సలహాసంఘము యీ ప్రజాసంఘమునకు భాధ్యత లేదు. కనుక యీ ప్రభుత్వము నియంతృత్వ ప్రభుత్వమని గాన్పడును.

16 నవంబరు 1918 సం॥న మరియొక మహాసభ జరిగెను, ఈ సభకు ప్రతినిధులుగా బోయి డి. జి.

యోటమో నుండి, జారికత్ ఇస్లామునుండి, సోషల్ డెమో క్రాటిక్ లేబరు పార్టీనుండి ప్రతినిధులువచ్చిరి. ౩-12-1918న ప్రజాసమితిలో సభ్యులు కొంతమంది ఒక తీర్మానము ప్రతిపాదించి నెగ్గించిరి.

1. ప్రజాస్వామ్య పద్ధతుల నవలంబించి యీప్రజా సమితి వుండుట, యీప్రజాసమితికి చట్టములు వ్రాసుచేయు అధికారము, యీ సమితియొక్క సభ్యత్వము ఎక్కువచేయుట, సభ్యులందరు ఎన్నికమీదనే సమితిలోనికి రావచ్చును,

2. ప్రజాసమితికి బాధ్యులుగావుండెడి మంత్రిత్వము వుండవలెను.

ఈ తీర్మానము ననుసరించి ప్రభుత్వమువారు ఒక విచారణసంఘమును నియోగించిరి. కాని అదియేమి పని చేయలేదు.

చివరకు చట్టసమ్మతమైనదియు సహకారముతో గూడిన పనులతో ఏమియు సాధించలేమని నిశ్చయము నకువచ్చి యీప్రజాసమితి బహిష్కరించు ప్రయత్నముతో జారికత్ ఇస్లామ్ పార్టీవారు బయటకు వచ్చివేసిరి. ఇదియే తరువాతి రెండుగా విభజించిపోయి ఒకపార్టీ ఇండోనేషియన్ కమ్యూనిస్టుపార్టీ అనుపేర పనిచేయ వచ్చెను. ఈ విధముగా ఇండోనేషియా స్వాతంత్ర్య సమరము అంత్యమునకు ఒక విప్లవకర, సహాయ నిరాకరణోద్యమము - రెంటిచే సాధించుటకు ప్రయత్నించిరి.

1922-23 సంవత్సరములయందు తదుపరి దేశ మంతటా సమ్మెలు ప్రారంభింపబడినవి. ఈసమ్మెలను అణచివేయుటకుగాను రాజప్రతినిధి కొన్ని ఆర్డినెన్సులను అమలుపరచెను. ఎక్కడనూకూడా ప్రజలు సమావేశము జరుపకూడదని, సమ్మెకు ప్రోత్సాహము యివ్వకూడదని యీసమ్మెలలో ముఖ్యముగా పేర్కొనదగినవారు రైల్వే వారు, రేవులలో పనిచేసెడివారు, కొంతమంది తోటల లో పనిచేసెడివారు. 1925 సమ్మెలలో ముఖ్యమైనవి సేమరాంగ్, సోయర్ బాజా ప్రాంతములలోనివి. నవంబరు 192ు మొదలు 1927 వరకు ప్రభుత్వమునకును యీజా తీయ సంస్థకును పోరాటము జావాసుమత్రాలలో మరింత వృద్ధి ఆయెను. జావాలో తిరుగుబాటు ఆరువారములు సాగెను. ఈ తిరుగుబాట్లకు ప్రతిగా చాలమంది దేశీ యులను జైళ్ళకుపంపుట వలసకుపంపుట ప్రారంభించ బడెను. 4500 మంది ఇండోనేషియన్లను జైళ్ళలోనింపిరి. 1360 కమ్యూనిష్టులను, జాతీయవాదులను డచ్చిన్యూగి నీలో ఒక ప్రదేశమునకు పంపిరి. అండమాను దీవులలో యెటువంటి కష్టములకు భారతీయులులోనైరో అటు వంటివి, అంతకు మించిన కష్టములలో అక్కడకు పంప బడినవారు అనుభవించవలసి వచ్చెను. ఆ ప్రదేశము పేరు "డిగోయల్." కమ్యూనిష్టుపార్టీ పూర్తిగా అణగ తొక్కబడెను. ఈ విధముగా విప్లవమును అణచివేసిరి. ఈపనులు ప్రభుత్వము చేయుటవల్ల దేశ

ములో అలజడి యెక్కువయ్యెను. చెల్లాచెదరై పోయిన అంశముల నన్నిటిని మరల ఒకచోట చేర్చుటకొరకు సారికత్ ఇస్లాము నిర్మాణ కార్య క్రమమును చేపట్టెను. రాజకీయములే పూర్తిగా యీసమితిని ఆవరించలేదు. జాతీయ, విద్యా, ఆర్థిక సమస్యలపై యీ సారికత్ ఇస్లామయొక్క దృష్టి కేంద్రీకరింపబడెను.

మొదటి ప్రపంచ మహాసంగ్రామము అయిన పిదప ఇండోనేషియన్లు హాలెండుకు పోయి విద్యనభ్యసించ మొదలు పెట్టిరి. ఇటుల విద్యాభ్యాసముచేసి తిరిగి వచ్చినవారు విద్యాసంస్కరణకు, విద్యాభివృద్ధికి బాగుగా తోడ్పడిరి. నలభై జాతీయ పాఠశాలలు తెరువబడినవి. వీటిలో కొన్ని మతమునకు సంబంధించినవే. మరికొన్ని పశ్చిమ విద్యావిధానమును తగిన మార్పుజేసి ఇండోనేషియనులకు ఏవిధముగా సహాయకారియగునో అటువంటి విద్యావిధానము వున్న స్కూళ్ళు మరికొన్ని. యివి యన్నియు ప్రభుత్వముచే తెరువబడిన విద్యా సంస్థలకు మాత్రము చాలాదూరముగా నుండెడివి. శాంతినికేతనములో రవీంద్రుడు ఎటువంటి విధ్యావిధానము అమలులోనికి తెచ్చెనో అటువంటి పద్ధతులమీద స్కూళ్ళు నడచెడివి. అదేసమయమున డా, సోయెటమో ఇండోనీషియన్ బ్యాంకును, ఇండోనీషియను భీమాకంపెనీని తెరచెను. ఈవిధముగా హాలెండుకు విద్యాభ్యాసము చేయుటకు వెళ్ళినవారిలో డా.సోయకర్నో కూడా ఒకడు.

అక్కడ విద్యార్థులంతా కలసి ఒకసంఘమును స్థాపించిరి. ఈ సంఘములో ఇండోనేషియన్లుకానివారు చేరుటకు వీలులేదు. 1924లో ఈ విద్యార్థి సంఘము విప్లవవిద్యార్థి సంఘముగా మారి సంఘ ఆశయము ఇండోనేషియాకు స్వారాజ్య సంపాదనగా మార్చబడెను. ఈ విద్యార్థులు తిరిగి తమ యిండ్లకు వచ్చిన పిదప యిక్కడున్న రాజకీయ సంస్థలన్నిటిని కలిపి ఒక జెండాక్రింద, ఒకే పార్టీ క్రింద దేశమంతా నడచుకొనుటకు ప్రయత్నము కొనసాగించిరి. అప్పుడు ఇండోనీషియా జాతీయపార్టీ స్థాపింపబడెను. దీనికి నాయకుడు. ముఖ్యుడు డాక్టరు సోయికర్నో, ఈ విధముగా ముఖ్యమైన పార్టీలన్నిటిని ఒక జాతీయ ఫెడరేషన్‌గా మార్చిన పిదప మూడవ జాతీయమహాసభ జరిగెను.

1927 వ సంవత్సరపు జాతీయమహాసభాధ్యక్షుడు తన ఉపన్యాసములు పూర్తిగా విప్లవసూచనలను వెళ్ళ కక్కెను, "జాన్ మహారాజు మాగ్నకార్టాను కలముతో సంతకము చేసెను. కాని ఎప్పుడంటే ప్రజలంతా సాయుధులైన పిదప." డిశెంబరు 1929 లో పూర్తిగావిప్లవ సూచనలు కన్పడెను. కాని నాయకులు అరెస్టు కాబడుటచే ఆ విప్లవజ్యోతి ఆరిపోయెను.

1930 సంవత్సరములో ప్రపంచమంతటా ఆర్థిక మాంద్యము వుండగా ఇండోనేషియాలో కూడా పరిస్థితులు చల్లబడినవి. వాటితోపాటు రాజకీయములను

కూడా ప్రజలు మరచిరి. సంఘములో నాయకులందరు అరెస్టు కాబడుటచే సరియైన నాయకుడు కూడా కాన రాడాయెను. సోయకర్నో అరెస్టయినపిదప చట్టములు కొన్ని ప్యాసుకాబడి ఏ విధమైన అలజడి లేకుండా ప్రభుత్వము జాగరూకతతో ప్రవర్తించినది. అదే రోజులలో మహమ్మదీయులు కొంతమంది మరి ఒక క్రొత్త పార్టీని లేవనెత్తిరి. దానిపేరు "పెర్మా". ఈ సంస్థ యొక్క ఆశయముకూడా స్వతంత్ర ఇండోనేషియాయే ఈ సంస్థయొక్క పలుకుబడిచే ప్రభుత్వము అలజడిజెంది 1935 వ సంవత్సరమున యీ పార్టీ నాయకులను కూడా ద్వీపాంతరము పంపివేసిరి. ఆ సమయమున ప్యాసుకాబడిన చట్టములలో—

(1) ఎవరైనా దేశమున అశాంతి ప్రబలింతురని ప్రభుత్వమునకు అనుమానము కల్గినయెడల అట్టి వారిని విచారణ లేకుండగా గవర్నమెంటుకుతోచిన ప్రదేశము నకు కాలపరిమితి లేకుండా ద్వీపాంతరవాసశిక్ష వేయుదురు.

(2) సమ్మెలను ఎవరైనా ప్రోత్సహించినగాని, కంట్రాక్టులమీద సంతకముచేసి పనులను నిర్వహింతుమని వ్రాసినవారు పనులు చేయకుండా వుంచుటకు ప్రోత్సాహమిచ్చినగాని, ఎవరైనా వారివారి వృత్తులలో వారియందు అశాంతి ప్రబలింతురనిగాని, ఆర్థిక పరిస్థితులలో మార్పులను తీసుకొని వచ్చుటకు యత్నము

చేసిన వారికి 5 సంవత్సరములు కారాగార వాసముగాని లేక జుల్మానాగాని విధించబడును.

(8) ఎవరైనా లిఖితపూర్వకముగాగాని, వ్యంగ్య చిత్రములను వేసిగాని శాంతి భద్రతలనుగూర్చి అందరికి అర్ధమయ్యే పదములలోగాని, అర్థమువచ్చే పదములలోగాని హాస్యాస్పదముగాగాని ఏమైన వ్రాసిన అటువంటివారికి 6 సంవత్సరములు కఠినశిక్ష లేక జుల్మానాగాని విధించబడును. ఇటువంటివి తదితరమైన చట్టములను ప్యాసుచేసి దేశములో ఏమాత్రము అల్లకల్లోలము లేకుండా వుండుటకు ప్రభుత్వము జాగరూకత వహించుటచే దేశములోని కొన్ని పార్టీలు అంతర్ధానమయ్యెను. మరికొన్ని వారి కార్యక్రమమార్గమును మార్పుచేసుకొనినవి. ఇవి 1936 సంవత్సరమునాటికి దేశపరిస్థితులు.

ప్రజలు ఓపికతో కొంతకాలము ఓర్చినప్పటికిని చివరికి అశాంతి మరల బయలుదేరెను. ఏదో విధముగా పనిచేయక పోయిన సంతృప్తి వుండదు అనెడు నిశ్చయమునకు వచ్చిరి. దానికి ఒకటే మార్గము కనబడెను— గవర్నమెంటుతో మరల సహకారమే దానికి త్రోవ. సమయానికి ఇద్దరు నాయకులుకూడా కన్పడిరి. వారు డా. సోయెటమో, తామ్రిన్. ఇంతకు పూర్వమే యీ డా. సోయోటమో, సోయకర్నోలకు కార్యక్రమ విధానములలో భేదముండెను. సోయకర్నో ఎప్పటికిని యీ సహాయ నిరాకరణ ఉద్యమము వదలరాదని సిద్ధాం

తము. సోయెటమో ఉద్దేశము ప్రకారముగ సరియైన సమయమునకు వేచియుండవలెను. ప్రజాసమితిలో కూడా యీ విధముగానే తన ఉద్దేశ్యమని వెలిబుచ్చెను. 1930 వ సం. లో తామ్రిన్ ప్రజాసమితిలో "నేషనల్ పార్టీ" అనెడు ఒకపార్టీని లేవనెత్తెను. అదేసమయములో బయట పఠన కేంద్రములు కొన్ని తెరువబడినవి. వీటి అన్నిటికిని నాయకుడు డా. సోయోటమో. ఎన్ని పార్టీలు వర్ధిల్లినా అన్నిటి ఆశయము మాత్రము స్వతంత్ర ఇండోనేషియా. 1936 వ సం॥లో ప్రజాసమితిలో సాయెతార్ధో అనెడువాడు ఒక తీర్మానమును ప్రతిపాదించెను. ఒకసమావేశము జరిపి ప్రభుత్వమువారు ఏవిధముగానైనా ఇండోనేషియాకు స్వపరిపాలనా విధానము సూచించవలెననియు, యీవిధానము ప్రవేశపెట్టుటకు కాలపరిమితి సూచించి అమలులోనికి తీసుకొని రావలెననియు యీ తీర్మానములోని ముఖ్యమైన విషయములు, యీ తీర్మానమును ప్రజాసమితి ప్యాసుచేసినది, కనుక యిది చట్టమగుటకుగాను దిహేగ్‌లో డచ్చిపార్లమెంటుకు పంపబడెను, 16 నవంబరు 1936 లో దిహేగ్‌లోని ప్రభుత్వము యీ తీర్మానమును తిరస్కరించి వేయుచూ ఇండోనేషియాలో యెన్నటికి కూడా స్వపరిపాలనా విధానము అమలులోనికి వచ్చుటకు వీలులేదని ఉత్తర్వు చేసెను.

ఈ వార్త ఇండోనేషియా ప్రజలు చెప్పుదెబ్బ కొట్టినట్టుగా భావించెను. ఈ తీర్మానముయొక్క తిరస్కారము అర్థమేమన యింక యెక్కువకష్టపడి యింక యెక్కువ జాగరూకతతో తెలివితేటలతో మెలిగి సాధించవలెననెడు ఉద్దేశమునకు వచ్చిరి. ప్రజలు యీ తిరస్కారము ఆశాభంగమునకు హేతుభూతము కాకుండ యింక యెక్కువ కష్టపడుటకు సాధన ఆయెను.

కనుక మరల దేశములోని అన్ని పార్టీలు మరల ఆంతరంగిక, బహిర్విధానము ఏ విధముగా వుండవలెనో యోచించుటకుగాను ఒక ప్రదేశమున కూడ చేరిరి. 1939 నాటికి యీ చర్చలు తీవ్రమయిపోయినవి. ఐరోపా దేశములో నియంతలు చిన్న చిన్న రాజ్యములను కబళించి వేయుచుండిరి. ఏనిముషము అగ్నిపర్వతము బ్రద్దలగునో అనెడు భయము యెక్కువాయెను. పశ్చిమమునకు జర్మనీ తిరిగిన దేశముగతి యేమగునని ప్రశ్న వేయబడెను.

అంతర్జాతీయ పరిస్థితులు పూర్తిగా మారిపోవుటచే ఇండోనేషియాకు, నెథర్‌లాండ్సుకు సంబంధ బాంధవ్యములు దూరమాయెను. ఇటు జపాన్ ఇండోనేషియా మీద కన్నువేసి ఉండెను. కనుక యీ పరిస్థితులలో ఇండోనేషియా ఏ విధముగా ప్రవర్తించవలెను?

ఈ విషయములను చర్చించుటకే యీ మహాసభ జరిగెను. ప్రతిపార్టీవారు తమతమ సిద్ధాంతములను

కార్యక్రమములను తెలిపిరి. వీటి యన్నిటిని క్రమముగా పరిశీలించిన పిదప జాతీయ కేంద్ర సంఘము స్థాపించుటకు వప్పుకొనిరి. కనుక 1939 లో తామ్రిన్ అధ్యక్షత క్రింద ఏ విధముగా యీ జాతీయ కేంద్రసంఘము స్థాపించవలెనో చర్చించుటకు ఒక మహాసభ జరిగెను. సెప్టెంబరు 1939 వ సంవత్సరమున వారి ఉద్దేశ్యములను తెల్పుచూ ఒక ప్రణాళికను బయటకు తెచ్చిరి. ఆ ప్రణాళికలో ఉదహరించబడిన సంగతులు:

(1) యీ పార్టీసభ్యులు అందరూ కలసి యేదైన ఒక పనిచేయుట, ప్రజలచే యెన్నుకొనబడిన ఒక పార్లమెంటును స్థాపించుట, యీ పార్లమెంటుకు బాధ్యులుగా వుండెడి ఒక మంత్రాంగము వుండుట.

(2) యీ విధముగా ప్రభుత్వము చేసినచో ప్రజలందరి సహకారము ప్రభుత్వమునకు వుండేలాగున తోడ్పడుట.

ఈ ప్రణాళిక ఉద్దేశ్యము పూర్తిగా జాతీయ వికాసము ప్రజలకు వచ్చినదని రూఢీచేయుట. ఈ విధముగా జేసినచో పరిస్థితులు తారుమారైననూ దేశములోని ప్రజలు తగు విధముగా ప్రవర్తించి వారి స్వాతంత్ర్యమును నిలపెట్టుకొనుటకు వీలయ్యేను.

1940 ఫిబ్రవరిలో దిహేగ్‌లోని ప్రభుత్వము యీ ప్రణాళికను ఆమోదించలేదు.

1. కాలము క్రమమైనది కాదు. ఇండోనేషియాలో ఏక్రొత్తమార్పును యిప్పుడు తలపెట్టుటకు వీలులేదు.

2. దేశములోని ప్రజలు చాలామంది నిరక్షరకుక్షులుగావున యే కొద్దిమందిమాత్రమే యీప్రణాళికను ఆమోదించిరి. అందువలన యీప్రణాళికను అంగీకరించుటకు వీలు లేదు అని డచ్చి ప్రభుత్వము జవాబుగా దెలియపరచెను. ఈవార్త ఇండోనేషియా ప్రజలు విని యిక యెంతమాత్రము జాగుచేయకూడదు, ప్రజలందరు కలిసి క్రమమైన పనులను చేయవలెనని తీర్మానించుకొనిరి,

మే 10, 1940 న హిట్లర్ నెధర్ లాండ్సుపై దండెత్తెను. తదుపరి ప్రభుత్వము లండన్‌లో తలదాచుకొనుటకు పారిపోయెను. ఇదే సమయములో ఇండోనేషియా ప్రాముఖ్యత గుర్తెరిగిరి. ఇంతవరకు పారిశ్రామిక విధానమును అమలులో పెట్టనప్పటికిని యీసమయమందు పారిశ్రామిక విధానమును అమలుపెట్టుట అత్యావసరమని గుర్తెరింగిరి. ఏరోజున అయితే బ్రతుకుజీవుడా అని ప్రభుత్వము పారిపోయినదో ఆరోజునుండి ఇండోనేషియా యింకావలస రాజ్యము కానేరదు. ఇండోనేషియా ప్రభుత్వమూ రాజప్రతినిధి చేతిలోవుండెను. ఈతడు ఒక నియంత అయి యిష్టమువచ్చినట్టుగా పరిపాలన చేయుచుండెను. డచ్చిపరిపాలనా విధానము ప్రకారము ఏరోజనైతే పరిపాలించుటకు ఒక దేశము వుండదో,

తనస్థానము తప్పిపోవునో ఆరోజున అంతవరకు ఆదేశము నకు ఉండియున్న వలస రాజ్యములు స్వాతంత్ర్యమును సంపాదించినట్లు చెప్పుచున్నది.

పరిస్థితులు తారుమారు అయినప్పటికిని ఇండో నేషియావ్రభుత్వము మటుకు "మేము పట్టిన కుందేలుకు మూడేకాళ్ళని" చెప్పినట్లు పరిపాలనా విధానములో యే మాత్రము మార్పు తెచ్చుటకు సంసిద్ధులుకాలేదు.

కాని ది హేగ్ లోని ప్రభుత్వము వారు మరి ఒకకొత్త వాగ్దానము చేసిరి. ఇంటికి తిరిగి చేరినతరువాత ఇండోనేషి యాకు యెటువంటి పరిపాలన విధానముండవలెనో యోచిం తురట కాని యిటువంటి వాగ్దానములలో నమ్మకము ప్రజలకు ఏమాత్రము లేదు. పూర్వము కూడా ఎన్నియో సార్లు యిటువంటి వాగ్దానములు చేయుట, తరువాత మరచి పోవుట మామూలు ఆయెను.

ప్రజలలో ఉత్సాహము, ఉద్రేకము, క్షీణించక నానాటికి వృద్ధి ఆయెను. కనుక సెప్టెంబరు 14, 1940 తేదీన వైన్‌మన్ అనువాని ఆధిపత్యము క్రింద ఒక విచారణ సంఘము నేర్పాటుచేయబడెను. ఈ విచారణ సంఘ ములో సభ్యులకు రాజకీయాలు చాలాకొత్తవి. కనుక ఏమిచేయవలెనో వారికి అర్థముకాలేదు.

అక్టోబరు 40 లో యిండోనీషియా రాజకీయపార్టీలు యీ విచారణ సంఘముతో ఏమాత్రము జోక్యము

కలుగ చేసుకొనరాదు అని తెలిపిరి. కాని 9-12-1941 న యీ విచారణ సంఘము వారు రిపోర్టును పూర్తి చేసిరి. ఇది అయిన మూడు నెలలకు ఇండోనీషియా జపాను వారి చేతిలో పడిపోయెను. ఈ రిపోర్టు రెండు భాగములుగా వ్రాసిరి. మొదటి భాగములో యీ రెండు యుద్ధముల మధ్య కాలములో ఏవిధముగా ఇండోనేషియాలో ఆర్థిక సాంఘిక రాజకీయ పరిస్థితులు మారినవో వ్రాయబడినది. రెండవ భాగమున ప్రస్తుతపు ఇండోనేషియా వారి కనీసపు కోర్కెలు ఉపహరించబడినవి. ఎందువల్లనైతే రాజకీయ ఫెడరేషన్ ఈ విచారణ సంఘముతో జోక్యము కల్గుజేసుకొనలేదో ఆ కారణమున ఈ రిపోర్టులో వ్రాసినవన్నియు ఇండోనేషియా ప్రజల ఉద్దేశ్యములని మనము అనుకొనుటకు వీలులేదు.

హీనపక్షము పార్లమెంటు అటువంటి సంస్థను ఇండోనేషియాకు యిచ్చియుండినచో కొంత అశాంతి తగ్గియుండెడిదేమో! ఆపత్కాలముననే రెండు వర్గములవారికి రాజీకుదరకపోయిన యుద్ధాంతరమున రాజీకుదురుట యింకను బహుకష్టతరము.

11 జులై 1941 న ప్రజాసమితిలో ఒక బిల్లు ప్రవేశపెట్టబడినది. దేశరక్షణకొరకు దేశీయ మిలిటరీ శిక్షణ యివ్వవలెను. ఇదే రోజులలో జపాన్ వారు ఇండోనేషియా మీద దండెత్తుదురని భయము వృద్ధి ఆయెను. కనుక అన్నివిధముల ఇండోనేషియాను సంరక్షించవలెను.

17 జూన్ 41 న జపాన్ ప్రభుత్వము, డచ్చిప్రభుత్వము
కలసి ఒక ప్రకటన జేసిరి. "ఇన్నిరోజులనుంచి ఆర్థిక
రాయబారములు కొనసాగుచున్నప్పటికిని రాయబార
ములు నిష్ఫలములైనవని ప్రకట చేయుటకు చింతించు
చున్నాము."

17 డిసెంబరు 1941న జపాన్ వారు పెరల్ హార్బరును
ముట్టడించిరి. డచ్చిరాణి జపాన్ వారిమీద యుద్ధము
ప్రకటించెను. కనుక ప్రజలకిష్టమున్నను లేకున్నను ఇండో
నేషియాకూడా జపాన్ మీద యుద్ధము ప్రకటించినట్లే.
జపాన్ వారితో రాజీ చేసుకొనుటకు ప్రజలలో ఏమాత్రము
యిష్టము లేదు. ప్రజలు ప్రభుత్వమునకు ఏవిధమైన
సహాయము జేయవలెనని తలచినప్పటికిని అటువంటి
ఐక్యత సంపాదించుటకు ప్రభుత్వము యిష్టపడలేదు.
కనుక జాతీయ రాజకీయ ఫెడరేషన్, దేశరక్షణను
ఒకదానిని ఏర్పాటు చేయుటకు తీర్మానించుకొనిరి.
7 మార్చి 1942 నాటికి ఇండోనేషియా జపాన్ వారి
చేతిలో పడిపోయెను. శత్రుబలము యెక్కువగుటచే
దేశము పరులచేతుల బడినప్పటికిని ప్రజలు అధైర్యపడ
లేదు. కనుక సరియైన సమయముకొరకు వేచియుండి
మరల ఇండోనేషియాకు సంపూర్ణ స్వరాజ్యమును సంపా
దించవలెనని తీర్మానించుకొనిరి. 1-8-1943 న హారదా
అను జపాను దేశీయుడు ఇండోనేషియా స్వపరిపాలన
జేసుకొనుటకు సమర్థురాలు కనుక జపాన్ వారివద్దనుండి

ఆయుధ సామగ్రి సంపాదించి జాతీయ సమరమును సరి యైన మార్గమున పెట్టవచ్చని తలచిరి. 24-9-1943 న సెంట్రల్ కౌన్సిల్ ఒకదానిని స్థాపించిరి. దానికి అధ్యక్షుడు డా. సోయెకర్నో. ఇటువంటి ప్రభుత్వము జపాన్ వారు స్థాపించినప్పటికిని ప్రజలనుండి సహకారము ఏమాత్రము కానరాలేదు. కనుక ఫిబ్రవరి '44 లో యీ ప్రభుత్వము జపానువారిచేత నీటిలో ముంచివేయబడినది.

1945 సం॥రమునకు జపానువారు అపజయము పొందుట మొదలిడెను. 6-8-'45 న హిరోషిమా అనెడు పట్టణముమీదఅమెరికావారు ఆటంబాంబుప్రయోగించిరి. ఆ పట్టణమంతా మట్టిపాలు ఆయెను. 15 ఆగస్టు 1945 న జపాన్ వారు మిత్రమండలికి లోబడిరి. డా. సోయకర్నో సైన్యమంతను జాగ్రత్తజేసి, ఆయుధసామగ్రిని సేకరించి జపానువారితో యుద్ధముజేసిరి. 17 ఆగస్టు 1945 ఇండొనేషియాను రిపబ్లిక్‌గా ప్రకటించిరి. ఆ రిపబ్లిక్ ప్రభుత్వమొక రాజ్యాంగ చట్టమును ప్రకటించినది. *

ఒక మంత్రాంగము 17 మంది సభ్యులతో ఏర్పరచబడినది, కాని డచ్చివారు యీ స్వాతంత్ర్యమును గుర్తించుటకు సంసిద్ధులు కాలేదు. మరల ఇండోనేషియాను వారి రాజ్యములో కల్పుకొనుటకు క్రొత్తగా యుద్ధమారంభించిరి. ఈ ఉద్దేశ్యముతో 6-11-'45 న

---

* అనుబంధము 2 చూడుడు.

పూర్వము చెప్పిన మాటలనే డచ్చిప్రభుత్వము మరల తెలిపినది.

లొంగుబాటు షరతుల ప్రకారము జనరల్ మెకార్థర్ ఒక ప్రకటనను జేసెను. ఆ ప్రకటన ప్రకారము ఇంగ్లీషువారికి ఇండోనేషియాలో జపాన్‌వారిని లొంగబరచుకొనుటకు, వారి ఆయుధసామగ్రిని లాగివేయుటకు, అక్కడున్న మిత్రమండలి సైనికులను, ఖైదీలను తిరిగి వారియిండ్లకు పంపివేయుటకు హక్కు ఇవ్వబడెను. ఈఉద్దేశ్యము వెలిబుచ్చి యీపని చేయుటకువచ్చినపుడు డా. సోయకర్నో వారికి సుస్వాగతమొసంగి ఈపని నిర్వహించుటకు ప్రజలను తోడ్పడమని విజ్ఞప్తి జేసెను.

ఇండోనేషియా రాజకీయములలో ఇంగ్లీషువారు యేమాత్రము జోక్యము కల్గజేసుకొనమని ప్రకటించిరి. చెప్పేది ఒకటి చేసేది మరొకటి అన్నట్లు ప్రసిద్ధముగా ప్రకటించినప్పటికిని బెవిన్ "పూర్వము డచ్చి దేశస్థులు మిత్రమండలితో చేయికలిపి పనిచేసినందువలన మరల ఇండోనేషియాలో డచ్చివారు ప్రభుత్వము సాధించుకొనుటకు అన్నివిధముల సహాయ్యము చేయుటకు అవుసరము కలదని" ప్రకటించెను.

ఈవిధముగా ప్రకటించి నౌకా, విమాన, కాల్బలముల సహాయ్యముతో ఇంగ్లీషువారు ఇండోనేషియాలో

న్యాయము, చట్టము నిలపెట్టుట అను పేరుతో ఇండోనేషి యన్లతో యుద్ధమారంభించిరి. యుద్ధములలో హిందూ దేశ సైన్యములనుకూడా ఇంగ్లీషువారు ఉపయోగించిరి.

ఈ సందర్భంలో జవహర్ పండితుని అభిప్రాయ ప్రకటన చాల ముఖ్యమైనది. "ఒకవైపున జావాలో స్వాతంత్ర్య పోరాటాన్ని అణుస్తూ రెండోవవైపున స్వేచ్ఛ, ప్రజాస్వామ్య సిద్ధాంతాలు, శాన్‌ఫ్రాన్సిస్కో పత్రాన్ని గురించి మాట్లాడటం మూర్ఖత్వం! రోజు రోజుకు జావాస్వాతంత్ర్య పోరాటం తీవ్రరూపం దాలు స్తోంది. ఐక్య మిత్రరాజ్యాలకు ముఖ్యంగా ఇంగ్లండు, అమెరికాలకు ఐక్యరాజ్యసమితికి ఒక విషమ పరీక్ష అయింది. డచ్ సేనలు ఇండోనేషియా సేనల్ని యేమీ చేయలేక పోతున్నవనే విషయం స్పష్టమౌతున్నది. అందువల్ల బ్రిటీషుసేనలు డచ్ సేనలకు సహాయంగా ప్రయత్నిస్తున్నట్లు కనుపిస్తున్నది ఇంకొక ముఖ్యమైన విషయమేమిటంటే ఇండోనేషియా ప్రజలమీద జపాను సైనికులను ఉప యోగిస్తున్నారు. కాని యీ పోరాటం తప్పకుండా ఆసియా ప్రజలందరి దృష్టిని ఆకర్షించింది. ఇంతకంటె విష మఫలితాలకు దారితీస్తుంది. ఆసియావాసులకు యుద్ధా నంతరం కూడ ప్రకటనలు, శుష్కవాగ్దానాలు తప్ప శాంతి, స్వాతంత్ర్యాలు లేనట్లు కనిపిస్తుంది. ఈవిధానం మొదలైనగని విద్వేష వినాశన విత్తనాలు చల్లి విపరీతమైన కష్టనష్టాలను కలిగిస్తుంది."

స్వదేశంలోని వారేగాక భారతదేశంలాంటి విదే
శాలలోని ఇండోనేషియన్లుకూడ బ్రిటీషు ప్రభుత్వచర్య
లకు అసమ్మతిని తెలియజేయుటకు సమ్మెలను చేసిరి.
భారతదేశంనుంచి జావాకు భారతీయ, బ్రిటీషుసేనల్ని,
ఆయుధ సామగ్రిని పంపటానికి బ్రిటీషుప్రభుత్వం ప్రయ
త్నించి నప్పుడు బొంబాయిలోని ఇండోనేషియా నావి
కులు సమ్మెతోపాటు సాయుధనావ బయలుదేరకుండ
సత్యాగ్రహము చేసిరి. వారు తమ దేశస్వాతంత్ర్యాన్ని
కాపాడుకొనేందుకు భారతనాయకులకు విజ్ఞప్తుల నంపు
తూ బ్రిటీషు ప్రభుత్వపు క్రూరచర్యలను ఖండిస్తూ ఒక
విస్పష్టమైన ప్రకటన చేసిరి. అందులో తమ స్వాతంత్ర్యే
చ్ఛను వీరోచితంగా ప్రకటించిరి. ప్రపంచమంతయు
బ్రిటీషువారి చర్యలను తీవ్రముగా నిరసించినది.

ఈ విధముగా జపానువారిని నిరాయుధులుగా
చేయు ఉద్దేశ్యముతో వచ్చినవారు యిట్లు ప్రకటించుట
ముఖమున వుమ్మివేసినట్టుగా అర్థమయ్యెను. తలవని తలం
పుగా ఇండోనేషియన్లు ప్రజాపరిపాలనతో స్వరాజ్యము
స్థాపించుట మిత్రమండలివారికి నచ్చలేదు. కాని ఇండోనే
షియా స్వాతంత్ర్యమును గుర్తెరంగనిదే మిత్రమండలి
వారు వారి నియుక్తపనులను చేయుట దుర్లభమాయెను.
కాని ఇండోనేషియా స్వాతంత్ర్యమును గుర్తించుటకు
సిద్ధపడలేదు.

ఇంగ్లీషువారికి కష్టములు ప్రారంభముగా మొదలు పెట్టినవి. కాలము గడచినకొలది ఇంగ్లీషువారి తాటస్థ్య విధానము తప్పుడుదారులు పట్టెను. ఇండోనేషియాలో జపానువారిచేత కొంతమంది డచ్చివారు ఖైదీలుగా వుంచబడిరి. వీరిని ఇంగ్లీషువారు కారాగార విముక్తులను జేసిరి. ఈ విధముగా స్వాతంత్ర్యము సంపాదించిన డచ్చివారు స్వతంత్ర ఇండోనేషియాయొక్క స్థానిక వ్యవహారములలో జేయికలుగజేసికొనిరి. వీరికి మద్దత్తు, సహాయము ఇటివద్ద ది హేగ్‌లోని ప్రభుత్వము, కొత్తగా స్థాపింపబడిన ప్రభుత్వము ఇంగ్లీషువారికి యిష్టమయినా అయిష్టమయినా వారుకూడా ముగ్గులోనికి రావలసి వచ్చెను. ఇట్లు వచ్చుటవల్ల వారి తటస్థ విధానములో మార్పువచ్చెను. జపానువారినుండి రాజ్యాధికారములు ఇండోనేషియన్లు వప్పగించుకొనుచున్న సమయములలో యీ ఇండోనేషియనులకు, డచ్చివారికి కొన్ని పోరాటములు జరిగినవి. ఇండోనేషియనులకు ఆ సమయమునకు సరియైన ప్రభుత్వము కానరాదు. వారికే వారి ప్రభుత్వమున్నదా అని సంకోచము.

చట్ట, న్యాయములు నిలపెట్టవలెనని ఇండోనేషియన్లు తలచినప్పటికిని డచ్చివారు ఇంగ్లీషువారిమీద వత్తిడి చేయుటవల్ల వీలుపడలేదు. ఈ రోజులలోనే అట్లీ, బెలిన్‌లు యీ ప్రకటనచేసిరి. "................... డచ్చివారు శాంతి, భద్రతలను సుస్థాపితం

చేసుకొని జావాలో వేలకొలది బందీలుగానున్న తమ దేశీయులైన డచ్చివారిని విడుదలచేసి అధికార స్వీకార మొనర్చేవరకూ వారికి మనం సహాయం చేయవలసిన మోమోటపు బాధ్యతవుంది ........" ఈ ప్రకటన ఫలితముగా ఇండోనీషియనులకు, ఇంగ్లీషువారికిని పోరాటములు జరుగుటకు వీలయ్యెను.

ఈ ప్రకటనవల్ల వచ్చిన మద్దత్తు చూసుకొని డచ్చివారు ఇండోనేషియా స్వాతంత్ర్యమును త్రోసి వేయ వచ్చునని తలచిరి. ఈ ఉద్దేశ్యముతో ఇంగ్లీషువారి మధ్య ఇండోనేషియనులమధ్య కొన్ని విషబీజములను నాటిరి. ఇంగ్లీషువారు యింటినుండి వచ్చెడు సహాయము నెదురుచూచుచు ప్రస్తుతము జపానువారి సహాయముతో రాజ్యమును పాలించుచుండిరి. ఇండోనేషియనులు ధైర్యముతో ప్రవర్తించి జావా, సుమత్రాలలో జపానువారిని నాశనముచేసి నప్పటికిని చట్ట, న్యాయములు సరిగా కానరాకుండపోయెను.

మాటల ప్రకారము, క్రియప్రకారము ఇంగ్లీషువారు చట్టన్యాయములను నిలపెట్టవలెచుకనుక వారు ఇండోనేషియనుల సేనలతో ఢీకొనవలసి వచ్చెను. దానికి ఫలితముగా సౌరబాయాలో ఇంగ్లీషువారికి ఇండోనేషియను మితవాదులకు మధ్య పోరాటము జరిగెను.

ఎన్ని విధముల మితవాదులు సంధిసమాధానము కొరకు ప్రయత్నించిననూ డచ్చివారి మూర్ఖత్వము వల్లనూ, అతివాదుల తీవ్రాందోళనవల్లనూ శాంతిపొసగు మార్గము కనుపించలేదు. బ్రిటీషువారికి సైన్యముల నప్పగించుట ఆత్మహత్య చేసికొనుటయేనని అతివాదుల వాదము. ఈ సమయములోని రాజకీయ నిస్తబ్దత జాతీయోద్యమములోని అతివాద వర్గాలను దృఢముగా బలపరిచింది.

అతివాద వర్గాలవారు, మితవాదులు కలిసిసాయుధపోరాటానికి సిద్ధమైనారు. గొరిల్లా యుద్ధ పద్ధతులు బాగుగా అభివృద్ధిచేయబడినవి. బ్రిటీషు సైన్యాలను యెదుర్కొనుట ప్రారంభించిరి. ఈ యెదుర్కొలును బ్రిటీషువారు గ్రామాలను సంపూర్ణంగా దహనంచేయుటద్వారా యెదుర్కొనిరి. బ్రిటిషువారి అమానుషఘోర కృత్యాలను పేర్కొనుటకు జకొస్లోవాకియాలో నాజీలు లుడిస్ అనే గ్రామాన్ని యేవిధంగా అమానుషంగా తగులబెట్టారో అదేవిధంగా జవాలో బెకాసి అనే గ్రామంలో వెయ్యి కలవయిళ్ళు సర్వనాశనం చేయబడ్డాయి. ఈ సంఘటనమీద ప్రపంచంలోని నాగరిక దేశాల్లోని విద్యావంతులు, రాజకీయ నాయకులు, పత్రికలు బ్రిటీషు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించిరి.

# ఉపసంహారము

యుద్ధానంతర కాలములో సమస్యలను పరిష్కరించుటకుగాను ఎన్ని ప్రణాళికలను ప్రకటించినప్పటికిని ప్రతి ప్రణాళిక యీక్రింద ఉదహరించబడిన రెండు ప్రశ్నలను ఏవిధముగా సమాధాన పరచునో చూడవలయును.

(1) ఏ విధముగా సమస్యలను పరిష్కరించుట వలన సుస్థిరశాంతి ఏర్పడును?

(2) స్వాతంత్ర్యపిపాస కలిగిన ప్రజలకు స్వాతంత్ర్యము సమకూర్చబడునా?

ఈ రెండు ప్రశ్నలకు సరియైన సమాధానములను యీప్రణాళిక యివ్వనియెడల మరి యెన్నిసమస్యలను పరిష్కరించుటకు ఒక ప్రణాళికసహాయ భూతమయినప్పటికి ఆ ప్రణాళికకు ప్రజామోదము కానరాదు.

ఇండోనేషియాలోని ప్రజలు చాలకాలమునుండి వలసరాజ్య విధానమునకు లోబడియుండి జాతీయజ్వాల అంతరంగమున ప్రజ్వలించుచుండెను. ఏదేశమైనను ఇండోనేషియాను ఆక్రమించినయెడల వారు తమదేశ స్వాతంత్ర్యమును నిలపెట్టుకొనుటకు ఎంతమాత్రమువెను దీయరు. ఈ యుద్ధకాలమున జర్మనీ, ఇటలీ దేశములచే మాల్టాదీవి దండయాత్ర ఎన్నియో పర్యాయములు

ప్రయత్నించబడినది. కాని ఆప్రయత్నములన్నీ విఫలములై మాల్టాదీవియందు స్థానమును బలపర్చుకొనుటచే ఆప్రదేశమునుండి మరల సిసిలీ, నేపుల్సు మీదకు దండయాత్ర సాగించుటకు మిత్రమండలివారికి వీలయ్యెను. జపాను దేశమంతా చిన్నచిన్న ద్వీపము లయినప్పటికిని జపాను దేశము లొంగబర్చుకొనుట కష్టసాధ్యమయ్యెను. ఇంగ్లీషు వారికి, అమెరికా వారికి నౌకాబలము ఎక్కువగా ఉన్నప్పటికిని ఆ నౌకాబలముచేత కాక ఆటంబాంబు శక్తికి మాత్రమే లోబడినదని అందరికీ విశదమైన విషయమే.

ఈ పరిస్థితులలో ఏమిచేసిన బాగుండునని ప్రశ్నించుకొనవచ్చును. ప్రతిదేశమునకు స్వాతంత్ర్యమిచ్చి ఆదేశ రక్షణ విషయమై ఆదేశ ప్రజలకే ఎక్కువ బాధ్యత వదలివేసినచో బాగుండును. దూరప్రాచ్యదేశ రక్షణల రక్షణబాధ్యత ఇండియా, ఇండొనేషియాల మీద వదలివేయవలెను. కాని యీదేశములకు సరియైన నౌకాబలము ప్రకృతము లేదు కావున అమెరికాదేశము యొక్క పసిఫిక్ సముద్రములోని నౌకాబలము హవాయి దీవులలో విమానబలము యీదేశములలోని కాల్బలము లకు సహాయముగా ఉంచవలెను. ఈ రెండు దేశముల యొక్క సంపద సౌభాగ్యములకా మితిలేదాయె. ఈ కారణముల వలన ఇండియా, ఇండొనేషియాలయొక్క

రాజకీయ పరిస్థితులను సరిగా అవగాహన చేసికొని ఇక్కడ సిరి సంపదలను దృష్టిలో పెట్టుకొనినచో దూర ప్రాచ్య దేశాల రక్షణవిషయమై ఎక్కువ సంకోచ పడ నవుసరములేదు. ఈ దేశములకు స్వాతంత్ర్య మివ్వనిచో బర్మాలోని ప్రజలు ఏవిధముగా శత్రువులకు సహాయ మొనర్చిరో అదేవిధముగా ప్రజలు సహాయ మొనర్చిన వింతగానేరదు. ఎంతిబలమైన సైన్యము వున్నప్పటికిని యీ పంచమాంగదళ సహాయము ఇంకా ఎక్కువగును. స్వాతంత్ర్యవిషయమై దూరప్రాచ్య దేశములు ఏమాత్రం రాజీకి ఒప్పుకొనవు ఏప్రభుత్వమైనను యీ జాతీయ దృక్కులను మరచిపోయి ప్రభుత్వమును స్థాపించుటకు ప్రయత్నించిన ఆప్రభుత్వమును త్రోసివేయుటకు దేశము లోని ప్రజలు సర్వశక్తులను వినియోగించవలెను, వినియో గింతురు.

ఈరోజులలో స్వాతంత్ర్య పిపాస ఒక పెద్దకొమ్మ, ఆకొమ్మ ఎక్కుటకుగాను రకరకమైన పద్ధతులను ప్రజలు అవలంబించవచ్చును. జాతీయ వికాసము ఎంతమాత్రము నిర్మాణ కార్యక్రమమును అవలంబించుట లేదని నేరా రోపణ చేయవచ్చును. కాని వలసరాజ్య విధానమును అమలుపరుచుచున్న దేశములకు నిర్మాణ కార్యక్రమమనెడి పదమునకు అర్థమువేరు, వారు కొద్దికొద్దిగా ముందునకు సాగవలెనని ఈ పదమునకు అర్థము చెప్పుదురు. అందరి ఆశయములు ఒక్కటియే యైనప్పటికిని ఐక్యతతో గూడిన

ప్రయత్నమును చేయుటలేదని నేరారోపణకూడా చేయుదురు. ఎన్ని నేరారోపణలు చేసినప్పటికిని ప్రజలు రాజకీయ పరిస్థితి విషయమై అసంతృప్తి చెందినయెడల వారిని అణగత్రొక్కుట కష్టసాధ్యమని వేరే చెప్పనవసరము లేదు.

జాతీయ వికాసమును మూడు భాగములుగా విభజించవచ్చును. i. జాతి సమానత్వము, ii పూర్తి రాజకీయ పరిపాలన, iii. ఆర్థిక స్వపరిపాలన.

ఒక శతాబ్దముపైనుంచి ఆంగ్లేయులు వారి జాతి విశిష్టతనుగూర్చి ఉపన్యాసములను చెప్పుచుండిరి. ఈకారణము వలన ఆసియావాసులు స్వతంత్రమును పొందుటకు అర్హత లేనివారని యూరోపియనుల వాదము. ఇండియా, బర్మా, మలయా దేశములలో ఈ దురహంకారము ఫలితముగా యూరోపియనులు సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయములలో వారి విశిష్టతను జాగ్రత్త పరచుకొనెడివారు. ఏ నేరములను చేసినప్పటికిని దేశీయ న్యాయాధికార్లు వీరిని శిక్షించుటకు వీలులేదాయెను. ఇండోనేషియాలో యిదేఒకఅడుగు ముందుకువెళ్ళి సాంఘిక, విద్యా, ఆర్థిక, న్యాయ పరిపాలనలో రెండు భిన్నశాఖలు ఏర్పడి ఒక శాఖ యూరోపియనులకొరకు, మరియొకశాఖ దేశీయులకొరకు నియమింప బడవలసివచ్చెను.

మేము పరిపాలించువారము కనుక మాకన్న మీరు తక్కువ యను వాదమునకు అర్థముండునా? లేక

చర్మరంగు ఆధారముగా చేసుకొని ఆసియావాసుల కన్న మేము గొప్పవారము అనెడి యూరపియనుల వాదమునకు అర్థముండునా ? ఈ సిద్ధాంతములయొక్క ఫలితము లెట్టివి ? కొలదికాలములో విద్యావంతులైన దేశప్రజలకంటె ఏ విధముగా పరిపాలించుచున్న దొరలు గొప్పవారో కాదో తేల్చబడెను. వెల్లడిచేయబడెను.

హిందూదేశములోనివారు ఆంగ్లేయులను మ్లేచ్ఛులని చెప్పుటకు కూడా ఇదియే కారణముగాబోలు! వారు పరిసరములలో వున్న యెడల మైలదోషము అనెడి నమ్మకము ప్రజలలో పుట్టెను. ఆంగ్లేయభాషనే అభ్యసించివున్న కొంతమంది దేశీయులకు పరిపాలించుచున్న వారికన్న మానసికముగా అధికులమనెడి నమ్మకము జన్మించెను. ఈ విధముగా ఆంగ్లవిద్య నభ్యసించిన ప్రజలు జాతీయ వాదము దేశములో ఉద్భవించుటకు ముఖ్యులు, ఐరోపా వాసీయులలోయున్న కట్టు వారి శిష్యతయందు నమ్మకము ఫలితముగా ఆసియాలో అటువంటి నమ్మకము ఉద్భవించుటకు కారణమాయెను. చరిత్రకారులు సాల మీనాస్ యుద్ధమునందు ఆసియా వాసీయులు ఓడింపబడిరి, లెపాంటు యుద్ధములో విజయము ఐరోపాదేయనెడు వాక్యముల వ్రాయ నారంభించిరి. సామ్రాజ్య వాదులకు యిటువంటి నమ్మకము లుండుట సహజమైన, కాన్‌స్టాంటు నోపిల్‌ను పట్టుకొనుట ఆసియా వాసులగెల్పు ఆసియా

వాసులందరు ఒకటే అనెడినమ్మకము పుట్టుటకు, ప్రచా
రము అగుటకు సామ్రాజ్యవాదులే కారకులు.

ఈ విధముగా చరిత్రకారులు వ్రాయుటయే
గాక ఈ సిద్ధాంతము అమలులోనికి వచ్చుటచే ఆసియా
వాసీయులు అనెడి పదమును ఆసియావాసులు సరిగా
అర్థము చేసుకొనిరి. ఏదేశములోనైన ఆసియావాసీయులు
అగౌరవింపబడిన యెడల దానికి ప్రతిగా ఆసియావాసులు
కూడా ఐరోపావాసీయులకు పాఠము నేర్పుట మొదలెట్టిరి.
ఈ సందర్భములో ఆఫ్రికాలో యీమధ్యనే ప్యాసుకా
బడిన "మాలపల్లిబిల్లు" చదువరులు మనస్సులో వుంచు
కొనవచ్చును. ఈ పరిస్థితులలో జపాను రష్యాను 1907
లో ఓడించెను. ఇంకను ఐరోపావాసీయుల విశిష్టత
యందు ఆసియావాసుల నమ్మకము సన్నగిల్లెను.

ఐరోపా జాతియొక్క విశిష్టత,ఆసియాజాతియొక్క
విశిష్టత యీ రెండు జీవించి యున్నంతవరకు ప్రపంచ
శాంతి, భద్రతల భయమునకు కారణమగును.

జాతీయ ప్రభుత్వము నెలకొల్పుట అనెడిది రెండ
వవిషయము. ఇండోనేషియాలో తదితర దేశములలో
కూడా పెద్దపెద్ద ఉద్యోగములన్ని దొరలకేకాని ప్రజ
లకు కావు. పూర్తిగా ప్రజాస్వామ్య సిద్ధాంతములను
అమలులో పెట్టలేదు. ఎక్కడ ఈ సిద్ధాంతములనను

సరించి సంస్థలను స్థాపించిన వాటికి సరియైన అధికార ములు లేక సలహా సంఘములుగానే పనిచేయుచున్నవనెడి విషయము పూర్వమే ఉదహరించబడినది.

మూడవది ఆర్థిక స్వాతంత్ర్యము. ఇది జాతీయ కార్యక్రమములలో ముఖ్యస్థానముఆక్రమించుచున్నది. వలస విధానము అమలులోనికి వచ్చుటచే రెండు ఆర్థిక భాగ ములుగా దేశమునువిభజించవలసి వచ్చెను. ఒకటి దేశీయ వ్యవసాయము, రెండవది పరదేశీయులు భూమిని గుత్తకు దీసుకొనుట. ఈ విధముగా ఆర్థికవిధానములో ద్వంద్వ విధానము ప్రవేశించెను. ఈ కారణము చేతనే వలస రాజ్యములుగా వ్యవహరింప బడుచున్న దేశములలో పరిశ్రమలు పెట్టుట కానరాదు. ప్రతి చిన్నవస్తువుకొరకు పరదేశములపై ఆధారపడి వుండవలసి వచ్చుచుండెను. కనుక దేశములోని శిరి, సంపదలను ఉపయోగించి పరి శ్రమలను వలస రాజ్యములో ప్రవేశపెట్టవలెను.

వీటి కొరకే ప్రాచ్యదేశములన్నియు పోరాడు చున్నవి. జావాకూడా దీనిని సంపాదించు కొనుటకు, ఎట్టి విరహామనుభవిస్తున్నదో మనముచూచుచున్నాము. స్వతంత్రం కోసం అట్టివిరహాన్నే మనంకూడా అనుభ విస్తున్నాం గనుక జావాను మనం బంధుప్రేమతో తిల కించి దాని ఆవేదన పట్ల ఆర్ద్రహృదయములము కావడం సహజం.

బానిస ఎక్కడ వున్నప్పటికి బానిసే! అతనిని వేధించేది ఒకటే—స్వాతంత్ర్యపిపాస; అతను ఆలాపించేది ఒకటే—స్వాతంత్ర్యగీతిక! ఏ బానిస దేశపు స్వాతంత్ర్య గీతికలైనాసరే తీసుకొని అందులో మరొక బానిస దేశపు పేరు నిమిడితే ఆగీతిక ఈ దేశానికి కూడా అక్షరాలా వర్తిస్తుంది.

♦ అదిగో నా మాతృదేశం !
అమర జావా సుభిక్షం ! ॥అది॥
అన్నికల్గియు కూడా
అన్యులకు రాని
ఎన్నాళ్ళకో స్వేచ్ఛ
ఎన్నాళ్ళకు పుణ్యరాశా ! ॥అది॥
కన్నీటితో గలిసి
కార్యదీక్షనుగొన్న
దివ్యకుఠారము లిచ్చి
దేశభక్తినినింపె
కడుపార ననుగన్న తల్లీ
కష్టపీడిత ప్రజకు చెల్లీ ॥అది॥

♦ ఆంధ్రపత్రిక, 2 డిశెంబరు 45.

# అనుబంధము 1

## డా. అబ్దుల్ రహమాన్ సోకర్నో జీవితం

---

'డాక్టరు సోకర్నో తన నలభై మూడవయేట కూడ, మధ్య యెత్తుగల మనిషి. వ్యాయామం చేసిన వానివలె దృఢముగా తనకున్న వయస్సుకంటె చిన్న వానివలె కనుపించును'. ఇది ఇండొనేషియా ప్రజా అధ్యక్షుడు సోకర్నోను ఒక పత్రికా విలేఖరి వర్ణించిన విధానము. అతని ప్రజలకోసం, దేశంకోసం అతడు చూపు త్యాగం, అనుభవించే బాధలు అతన్ని సామాన్య మానవుని కతీతమైన ఉన్నతస్థాయిలో ఉంచినవి. నిన్న మొన్నటి వరకు స్వదేశంలోనే పేరు ప్రతిష్ఠలున్న మనిషి యీనాడు ప్రపంచమంతటా గౌరవమన్ననలు పొందుచున్నాడు. ఇండొనేషియా విప్లవం సోకర్నోను రాబోయే ఆసియా నాయకుల్లో ఒకణ్ణిగాను, పతిత ప్రజానాయకునిగాను చేసింది.

సోకర్నో ఉత్తమ ఇండొనేషియా సంస్కృతికల వ్యక్తి. తండ్రి మహమ్మదీయుడు, తల్లి హిందువు. తండ్రి జావాలో సరదారు, తల్లి బాలిదీవికి చెందిన ఉత్తమవంశజు

రాలు. 1901 జనవరిలో సోకర్నో జన్మించెను. ఎక్కువ ఖర్చుతో కూడిన డచ్ స్కూల్లో విద్యాభ్యాసం జరిగింది.

చిన్నతనంనుంచి అధిక ధనవంతుల మధ్య నిరు పేదలు పడు ఘోరావస్థలు అతని దృష్టి నాకర్షించినవి. బీద కుటుంబాలనుంచివచ్చు తన యీడుపిల్లలను ఎక్కువ గా 'మీరెందుకు బీదగావున్నార'ని ప్రశ్నించువాడు. అత నికి ఆకారణము తెలిసికొనుట కెక్కువకాలము పట్టలేదు.

ఉన్నత విద్యాభ్యాసములోగూడా అతడు మంచి వక్తయై నాయకపాత్రవహించువాడు, అతడు మంచి రచయితకూడను. అదృష్టవశాత్తు జాతీయ ఇండో నేషియా ఉద్యమకర్త హాజి ఓమర్ సయద్ జుకొమి నోటోవద్ద ఉండేవాడు. జొకొమినొటో మంచి ప్రచా రంలోనున్న 'ఒటొసన్ హిండియా' అను పత్రికకు సంపాదకుడుగా ఉండువాడు. విద్యార్థిగా నున్న సోకర్నో ఆపత్రికకు రచయితగా నుండువాడు. ఈపత్రికకు మారు పేరుతో వ్రాయువాడు, పాండవవీరుడు భీముని పేరు పెట్టుకొనుటలోనే అతని గొప్పదనము కనుపించినది.

కొంతకాలమునకు తను యెవరివద్ద యింతకాల మునుంచి ఉండి విద్యాబుద్ధు లలవరచుకొని యున్నాడో ఆయన కుమార్తెనే వివాహమాడినాడు. అతని సంస్కార జీవితము అధికారులదృష్టి నాకర్షించినది. ఒకసారి సౌర

బాయిలో గంభీరంగా ఉపన్యసించుచుండగా పోలీసు అధి కారులు వచ్చి ఆసభను చెల్లాచెదురు చేసివేసెను. అప్పటి నుంచి అతడు తన ఉపాధ్యాయుల వద్దనుంచి తిరస్కార ములు పొందుట ప్రారంభమాయెను. అతడు ఖండితము గా ఒకే ఒక సమాధానము చెప్పువాడు: "నేను రాజకీయ ములను ఒదులుకొనలేను."

క్రిందటి ప్రపంచ సంగ్రామానంతరం (1918) పారిశ్రామిక (Engineer) విద్యలో ఉన్నత శిక్షణ పొందుటకొరకు హాలెండు వెళ్ళినాడు. తన దేశమునకు సంబంధించిన విషయములలో చాల చురుకుగా నుండి ఇండొనేషియా స్వాతంత్ర్య పోరాటముకొరకు కృషి చేయు తనదేశీయ బృందము(ఇండిచే వెరీనింగిఁగ్)తో కలిసి పనిచేయువాడు. 1921 లో యీసంఘమే తీవ్రవాదులై "పెర్హింపోర్ ఇండొనేషియా" అని పేరుమార్చుకొనిరి. ఈ సంఘము జావానుంచి వచ్చు ముస్లిములను, బాలి నుంచి వచ్చు హిందువులను చేర్చుకొనిరి. వేడిరక్త పూరితులైన ఇండొనేషియా యువకులు తమదేశమును విదేశీయ పరిపాలన బారినుండి విముక్తిగావించి స్వతంత్ర తమదేశమును దేశముగా చూడ కంకణము కట్టుకొనిరి.

1927 లో సోకర్నో 'పర్టై జాతీయ ఇండొ నేషియా'ను స్థాపించినాడు. దాని మూల సిద్ధాంతములు దైవభక్తి, జాతీయత, విశ్వమానవ సోదరత్వము,

ప్రజాస్వామ్యము, సామాజిక రక్షణ. సోకర్నో యొక్క
ఎరుపు తెలుపు రంగులజెండా, ఆ జండా పాటైన 'ఇండో
నేషియా రాయ' ఈనాటికి జాతీయ పతాకముగను,
జాతీయ గీతముగను పరిగణింపబడుచున్నవి. 1929 అనం
తరమే 1927 విప్లవంతో సోకర్నోకు సంబంధ మున్న
దనే నెపంతో అరెస్టుచేసి నాలుగు సంవత్సరాలు కఠిన
ఖైదు విధించిరి. సగము శిక్ష అనుభవించగనే విడుదలై
తీవ్ర రాజకీయములలో నిమగ్నుడాయెను. అంతర్జాతీయ
ఆర్థిక దుస్థితి ప్రజల ఆర్థిక జీవనముమీద పెద్దదెబ్బ
తీసెను. అందువల్ల సోకర్నో ముఖ్యముగా సామా
జిక పునర్నిర్మాణములో ఆర్థిక సూత్రములకు, విధానము
యెక్కువ ప్రాధాన్యమిచ్చెను.

1933లో అతనిని మరియొకమారు అరెస్టుచేసిరి.
ఫ్లోర్స్ దీవులకు పంపిరి. అయిదు సంవత్సరము లనంత
రము బంకోలిన్‌కు బదిలీచేసిరి. అక్కడ వివిధమతముల
పరిశోధన గావించినాడు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామకాలములోకూడ నిర్బం
ధములోనే వున్నాడు. అతడు సహాయ ప్రకటనచేసినప్పటికి
సామ్రాజ్యవాదులైన డచ్ ప్రభుత్వమువారు యేమా
త్రమూ చలింపరైరి. జపానువారు తూర్పు ఇండియా
దీవులను గెలిచిన తరువాత అతడు విడుదలైనాడు. వారు
అతని ధైర్య స్థైర్యములు, గొప్ప పలుకుబడి, త్యాగమును

గుర్తించి అతనికి స్వాతంత్ర్య మిచ్చుటకు సిద్ధపడిరి. తనకు లభించిన అవకాశము నుపయోగించుకొని తన ప్రజలకు సేవచేయుటకు, ప్రజాసంఘముల నిర్మాణము చేయుటకు ఆ అవకాశము నుపయోగించుకొనెను. అతడు టోకియోకు ఆహ్వానింపబడెను. చక్రవర్తిని చూడగా అతడు వీరోచితముగా గౌరవింపబడినాడు. జపానునుంచి, అంతకుముందెప్పుడూ లేని పట్టుదలతో తన దేశస్వాతంత్ర్యము కొరకు పాటుబడుటకు, తిరిగి వచ్చినాడు.

జపానుకు లొంగుబాటైన రెండురోజులకే అపురూపమైన రాజకీయ చతురతతో జావా ప్రజారాజ్యమును ప్రకటించి తాత్కాలిక ప్రభుత్వము నేర్పాటుచేసెను. జపాను అధికారులు నిర్బంధించబడినారు. వారి ఆయుధములు, మందుగుండు సామగ్రి వగైరాలు ప్రజారాజ్య ప్రభుత్వసేనలకొరకు స్వాధీనపరచుకొన బడినవి.

డా. సోకర్నో యింకా యువకుడే. ఆసియా ప్రజలందరూ అతని కొరకెదురు చూచుచున్నారు. ఈనాడు స్వతంత్రి ఇండోనేషియా స్థాపనకు మూలపురుషుడు. అతనికి విజయప్రాప్తి శీఘ్రకాలములో చేకూరును!

# అనుబంధము 2

## ఇండోనేషియా ప్రజాస్వామ్యరాజ్యాంగ చట్టము

### ప్రకరణము 1

### ప్రభుత్వస్వరూపము

క్లాజు 1.

1. ఇండొనేషియా సంయుక్తరాజ్యము.

2. ఆమె సంపూర్ణస్వామిత్వము ప్రజలద్వారా ప్రకటింపబడి, "మజాలిస్ పెర్మోజవారటన్ రజత్" M. P. R. (అత్యున్నత రాజ్యాంగసంఘము) ద్వారా వ్యక్తపరుపబడును.

### ప్రకరణము 2.

### 'మజాలిస్ పెర్మోజవారటన్ రజత్'

క్లాజు 2.

1. ఈ మ. పె. ర 'దివాన్ పెర్వాకిలాన్ రజత్' (D. P. R. సామాన్యప్రజానంఘము) నుంచీ,

ఈ ప్రణాళిక ప్రకారం వివిధప్రాంతాలనుంచి, వివిధజాతులనుంచీ వచ్చు ప్రతినిధులతో కూడి వుంటుంది.

2. ఈ మ. పె. ర దేశ ముఖ్యపట్టణములో ఐదు సంవత్సరముల కొకసారైననూ కనీసము సమావేశము కావలెను.

3. ఈ మ. పె. ర నిర్ణయములన్నియు అధిక సంఖ్యాకుల ఓట్లతో నెగ్గవలయును.

4. ఈ మ. పె. ర రాజ్యాంగ చట్టములను నిర్ణయముచేసి, రాజ్యాంగ విధానమును సూచించును.

## ప్రకరణము 3.

## పరిపాలనాధికారము

క్లాజు 3.

1. అధ్యక్షుని పరిపాలనాధికారము ప్రణాళికలో నిర్ణయించబడినది.

2. ఆయన విధి నిర్వాహణములో సహాయము కొరకు ఉపాధ్యక్షుడుండును.

3. అధ్యక్షునికి ది. పె. ర అనుమతితో చట్టము లను చేయు అధికారముకలదు.

4. అధ్యక్షుడు అధికార పత్రముల ప్రకటించుట ద్వారా న్యాయము అమలు జరుగునట్లు చూచు చుండును.

క్లాజు 4.

1. అధ్యక్షుడు ఇండొనేషియా వాసియై వుండ వలెను.

2. అధ్యక్ష, ఉపాధ్యక్షులు మ. పె. ర. సభ్యుల అధిక సంఖ్యాకుల ఓట్లతో యెన్నుకొనబడవలెను.

క్లాజు 5.

1. అధ్యక్ష, ఉపాధ్యక్షులు ఐదుసంవత్సరముల కొకసారి యెన్నుకొన బడవలెను. తిరిగి వారేయెన్నుకొన బడవచ్చును.

క్లాజు 6.

1. అధ్యక్షుడు రాజీనామా నిచ్చుట వల్లగాని, చచ్చుట వల్లగాని అధ్యక్షస్థానం ఖాళీ అయినయెడల ఉపాధ్యక్షుడే మిగత కాలమునకు అధ్యక్షుడు.

క్లాజు 7.

1. అధ్యక్షుడుగాని, ఉపాధ్యక్షుడుగాని తమ విధి నిర్వహణకు ముందు మ. పె. ర ముందుగాని, ది. పె. ర ముందుగాని యీ ప్రమాణమును చేయవలెను.

"అధ్యక్ష, ఉపాధ్యక్షులమైన మేము మావిధులను సర్వవిధములవీలైనంత న్యాయ చట్ట సమ్మతముగ నెరవేర్చెదము. చట్ట, ధర్మ రీత్యా దేశ, ప్రజలకు సేవ జేసెదము."

క్లాజు 8.

1. భూ, జల, వాయు బలాలమీద అధ్యక్షునికి సర్వాధికారములున్నవి.

క్లాజు 9.

1. ది. పె. ర అనుమతితో అధ్యక్షుడు యితర దేశములతో యుద్ధ, సంధులను ప్రకటించుటకు సర్వాధికారము కలదు.

క్లాజు 10.

1. అధ్యక్షుడు ప్రభుత్వ ప్రకటనద్వారా సైనిక శాసనము ప్రకటించుట కధికారము కలదు.

క్లాజు 11.

1. అధ్యక్షుడు రాయబారులను నిర్ణయించవచ్చును.

2. విదేశ రాయబారులను ఆహ్వానించవచ్చును.

క్లాజు 12.

1. అధ్యక్షుడు యెవరినైనా క్షమించవచ్చును.

క్లాజు 13.

1. అధ్యక్షుడు బహుమతులు వగైరాలు యెవరికైనా యివ్వవచ్చును.

## ప్రకరణము 4.

## 'డివాన్ పెర్వాకిలాన్ అగోయెంగ్'

క్లాజు 14.

1. చట్టం ప్రకారం ఈ డి. పె. అ నిర్మించబడినది.

2. తాను చేస్తున్న కార్యకలాపాలమీద వచ్చు ప్రశ్నలకు సమాధానము లీయవలెను. ప్రభుత్వమునకు

కొన్ని క్రొత్తవిధానములను సూచించుటకు ఈ సంఘమునకు అధికారము కలదు.

## ప్రకరణము 5.

## మంత్రాంగములు

క్లాజు 15.

1. అధ్యక్షుడు మంత్రుల తోడ్పాటుతోనుండును.

2. మంత్రులు అధ్యక్షునిచేత నిర్ణయింపబడుదురు.

3. మంత్రులు తమంతటతామే తమ రాజ్యాంగ శాఖల నేర్పరచుకొందురు.

## ప్రకరణము 6,

## స్థానిక పరిపాలన

క్లాజు 16.

1. స్థానికపరిస్థితుల కనుగుణ్యాంగానూ, రాజ్యాంగ సంఘంయొక్క సామాన్యవిధానా న్ననుసరించీ చట్టం ప్రకారం చిన్న, పెద్ద స్వతంత్ర స్థానిక పరిపాలన గల్గిన జిల్లాలతో కూడివున్నది ఇండోనేషియా,

# ప్ర క ర ణ ము 7.

## దిః పె. ర.

క్లాజు 17.

1. ది. పె. ర. ఒక సంవత్సరం ఉంటుంది.

2. ది. పె. ర. చట్టబద్ధంగా నిర్మించబడింది.

క్లాజు 18.

1. ప్రతిచట్టము ది: పె. ర చేత అమోదింపబడ వలెను.

2. ఒకసారి యేచట్టమునైన ది. పె. ర నిరాక రించినయెడల మరలదానిని పునరుద్ధరించుటకు వీలులేదు.

క్లాజు 19.

1 ది. పె. ర సభ్యులు చట్టములను ప్రవేశపెట్ట నర్హాత గల్గియుందురు.

2. ఏ చట్ట ప్రతిపాదనైన ది. పె. ర చేత ఆమో దింపబడి అధ్యక్షునిచేత నిరాకరింపబడిన యెడల అది మరల పునరుద్ధరింపబడదు.

క్లాజు 20.

1, క్లిష్టపరిస్థితుల్లో తన క్లిష్టమైనట్లు ప్రస్తుత చట్టములకు బదులు క్రొత్తవిధానముల నమలు జరుపవచ్చును.

2. అట్టి క్రొత్తవిధానములు ది. పె. ర చేత ఆమోదింపబడవలె, అట్లు కానియెడల ఉపసంహరించుకొనవలెను.

ప్రకరణము 8.

ఆర్థిక శాఖ

క్లాజు 21.

1. ప్రతి సంవత్సరము దేశ ఆదాయ వ్యయ అంచనా పట్టిక ఆమోదింపబడవలెను. ఏ సంవత్సరమైన ది. పె. ర ఆ పట్టికను నిరాకరించిన యెడల క్రిందటి సంవత్సర పట్టిక ప్రకారము జరుగును.

2. ప్రభుత్వమునకగు ప్రతి ఖర్చును చట్టబద్ధమైవుండవలెను.

3. ఆర్థిక విధానముకూడ చట్టబద్ధమై వుండవలెను.

4. ఒక ప్రత్యేకాధికార సంఘము అర్థిక విధానమును తన స్వాధీనములో నుంచుకొనును. ఆసంఘము తన పోర్టును ది. పె. ర కు పంపవలెను.

## ప్ర క ర ణ ము 9

## న్యా య ము

క్లాజు 22.

1. న్యాయచట్టము శాఖలతో సహా చట్టబద్ధమై వుండవలెను.

క్లాజు 23.

1. న్యాయాధిపతులను నియమించుట, తొలగించుట చట్టబద్ధమై వుండవలెను.

## ప్ర క ర ణ ము 10.

## పౌ ర స్వా మ్య ము

క్లాజు 24.

1. చట్టరీత్యా యితరజాతి ప్రజలుకూడ గుర్తింపబడిన యెడల యీదేశపు పౌరసత్వ హక్కులను పొందెదరు.

8. పౌరస్వామ్య స్థితిగతులు చట్టబద్ధమై వుండవలెను.

క్లాజు 25.

1. పౌరులందరూ న్యాయ, రాజకీయ హక్కులను గలిగి ప్రభుత్వమునకు విధేయులై వుండవలెను.

2. ప్రతి పౌరుడును గౌరవజీవితమునకు పాత్రుడై వుండును.

క్లాజు 26.

1. పత్రికా, భావ, సభా, ప్రకటన, నిర్మాణ స్వాతంత్ర్యములు చట్టబద్ధములై వుండవలెను.

## ప్ర క ర ణ ము 11.

## మ త ము

క్లాజు 27.

1. రాజ్యాంగ మూలసూత్రములు సర్వాంతర్యామియైన భగవత్సేవమీద ఆధారపడి వున్నవి.

2. ప్రతిపౌరుడు తన కిష్టమైన మతము ననుసరించుటకు హక్కును ప్రభుత్వ మిచ్చును.

## ప్ర క ర ణ ము 12.

## దే శ ర క్ష ణ

క్లాజు 28.

1. ప్రతిపౌరుడు తనదేశమును రక్షించుకొనుటకు హక్కును గలిగి, తన విధిని నెరవేర్చవలసి యున్నది.

2. దేశరక్షణ విధానము చట్టబద్ధము.

## ప్ర క ర ణ ము 13.

## వి ద్య

క్లాజు 29.

1. ప్రతిపౌరుడు విద్యను పొందుట కర్హుడు.

2. విద్యావిధానము చట్టబద్ధము.

క్లాజు 30.

1. ప్రభుత్వము ఇండోనేషియా జాతీయసంస్కృతిని పెంపొందించును.

## ప్ర క ర ణ ము 14.

## సాంఘిక కార్యకలాపాలు

క్లాజు 31.

1. పరస్పర సహకార బద్ధమైన సమిష్టి విధాన పూరిత ఆర్థిక నిర్మాణము.

2. ముఖ్యమైన సమిష్టి ప్రయోజనముకొరకు నిర్మి తమైన భారీపరిశ్రమలను జాతీయము చేయుదురు.

3. భూమి, నీరు, భూసంపద ప్రభుత్వపుటాస్థి. వీటిని ప్రజల సౌభాగ్యాభివృద్ధికి ప్రభుత్వము వినియో గించును.

క్లాజు 32.

1. నిరుపేదలు, అనాథలైన పిల్లల రక్షణభారము ప్రభుత్వము వహించును.

## ప్రకరణము 15.

## పతాకము, భాష

క్లాజు 33.

1. ఇండొనేషియా పతాకము ఎరుపు, తెలుపు రంగులు గల్గియుండును.

క్లాజు 34.

1. భాష ఇండొనేషియా భాష.

# ప్ర క ర ణ ము 16.

## రాజ్యాంగ చట్టములో మార్పులు

క్లాజు 35.

1. రాజ్యాంగచట్టములో మార్పులు సూచించ బడునప్పుడు మ. పె. ర. లో కనీసము 2/3 వంతులైనను హాజరుకావలెను.

2. నిర్ణయములు హాజరైన సభ్యులలో 2/3 వంతుల మందిచేతనైన ఆమోదింపబడవలెను.

---

## శేషపూరణానుబంధము

క్లాజు 1.

ఇండొనేషియా రాజ్యాంగ నిర్మాణ సంఘము ఇండొనేషియా ప్రభుత్వమునకు రాజ్యాంగాధికారమును అప్పగించును.

క్లాజు 2.

ఇప్పటి అన్ని ప్రభుత్వ కార్యాలయాలు, శాసనములు క్రొత్త రాజ్యాంగ చట్టరీత్యా క్రొత్తవి అమలులోనికి వచ్చువరకు యథాతథముగ పనిచేయును.

క్లాజు 3.

మొదటి అధ్యక్ష, ఉపాధ్యక్షులు ఇండొనేషియా స్వాతంత్ర్య రాజ్యాంగ నిర్మాణ సమితిచేత యెన్నకో బడుదురు. మ. పె. ర, ని. పె. ర, ది. పె. అ నిర్మాణ మగు లోపున జాతీయ సమితి సహాయముతో అధ్యక్షుడే రాజ్యాంగ కార్యములను చక్కబెట్టును.

## అనుబంధము

క్లాజు 1.

ఈ ఆసియా మహాసంగ్రామానంతరము ఆరు మాసముల తరువాత ఇండొనేషియా అధ్యక్షుడు ఈ చట్టమునమలులో పెట్టును.

క్లాజు 2.

మ. పె. ర నిర్మాణమైన ఆరుమాసముల తరువాత చట్టమును తయారుచేయుటకు సమావేశమై పని ప్రారంభించవలెను.

---

# నేరస్థులు: వారి స్థితిగతులు

## ఏ. ఎం. సోమసుందరం, ఎం ఏ.

ప్రతిరోజూ మార్పుచెందుతున్న సంఘంలో తీవ్రమై ఎదుర్కోవలసి, పరిష్కరించవలసిన సమస్య లెన్నో వుంటవి. ఈ సమస్యలను పరిష్కరించనిదే సంఘం అభివృద్ధిలోకి రాజాలదు. మన దేశంలో యిలాంటి సమస్య లెన్నో వున్నవి.

ఈ దేశంలో ఆర్థిక, సాంఘిక సమస్యలు అతితీవ్రరూపం దాలుస్తున్నవి. దారిద్ర్యానికితోడు నేరప్రవృత్తిగూడ అధికంగానే వ్యాప్తి చెందుతున్నది. ప్రభుత్వ చర్యలు, శాసనములు దీనిని ఆపలేక పోతున్నవి. 1931-32 లో యీ దేశబందీల సహాయకకార్యదర్శి వేసిన అంచనా ప్రకారం బొంబాయి, బెంగాలు రాష్ట్రాలలో షుమారు 2½ లక్షల మంది నేరాలుచేసి, శిక్ష పొందినారని తెలుస్తున్నది. ఒక్క సంయుక్తరాష్ట్రాలలో క్రిమినల్ జాతులుగా ఎంచబడ్డవాళ్ళ సంఖ్య 14 లక్షల మంది. వీళ్ళల్లో చాల మందిని పీనల్ సెటిల్ మెంటులో పెట్టారు. ఒక సంవత్సరములో పోలీసు రికార్డులనుబట్టి చూస్తే వీళ్ళల్లో 37,400 మంది వివిధ నేరాలు చేశారని తోస్తున్నది. వీటిలో ముఖ్యంగా పేరుబడ్డ జాతులు : సాకిన్ యా, భాటూ, శార్వాల్, గిధియా, హాబరా, కంజార్, దోమ్ మొదలయినవి.

నేరజాతికి చెంది నేరస్థుడని తలవబడే వాడుమాత్రం మానవుడు కాడా? వానికి భిన్నమగు స్వభావాదులుంటవా? అతనిలో నేరప్రవృత్తి యెందుకు ప్రవేశించింది? క్రమంగా యెట్లా వృద్ధిపొంది, నేరాలకు దారి తీసింది? దానిని రూపుమాపి అతణ్ణి సన్మార్గంలో ప్రవేశపెట్టి సంఘానికి ఉపయోగకరమైన పౌరుణ్ణిగా తయారు చెయ్యటానికి వీలులేదా? ప్రభుత్వ కర్తవ్యమేమిటి? అనే విషయాలు చర్చిస్తే నేరస్థుల, నేరజాతుల సమస్య తెల్లమయి సులువుగా పరిష్కరించబడుతుంది.

ధర: రు. 2-0-0

:: విజ్ఞాన సాహిత్య పనం ప్రచురణ ::

# పరీక్ష

## జైనేంద్రకుమార్

హిందీవాఙ్మయములో జైనేంద్రకుమార్ సిద్ధహస్తులైన గద్యకవులలో ఒకరు. తమప్రత్యేకతను నిలుపుకొంటూ స్వర్గీయప్రేమచందుగారి పార్శ్వాన కూర్చొనదగినవారు జైనేంద్రకుమారులు. నవలారచనలోనేకాక కథానికా రచనలోగూడా వీరు అందెవేసిన చెయ్యి. వీరి ప్రత్యక్షరంలోనూ ముత్యాల శాలలోని వెలుగు జిలుగులాగ ఎడతెగని మృదుభావ పుంజాలు తొణుకుతూ వుంటుంది.

ఇప్పుడు మేము పాఠకులకందించుచున్న "పరీక్ష" నేటి యువలోకానికి పరీక్ష. చదువుకొన్నవారయ్యూ నేటి యువకులు లక్ష్యాన్ని నిర్ణయించుకోలేక, జీవితపథంలో అడుగిడురీతి తెలియక భ్రమించిపోతున్నారు. ఆలోచించువారు, ఈ ఆలోచనలో జీవితమును వ్యర్థపుచ్చుకొంటున్నారు.

విధివిధానములేని విలాసాల్లో జీవితాన్ని పలుచనచేసికొని సుఖపడుతున్నారు. గృహస్థాశ్రమంలో కాలుపెట్టి స్త్రీ సహచర్యాన్ని యెట్లుపయోగించుకొనవలెనో తెలియజాలక నిత్యజీవితమను అగ్నిగుండంలో మాడిపోవుచున్నారు. ఇట్లు వ్యవస్థలేని వ్యక్తిజీవితాన్ని ఈ 'పరీక్ష' లో మన మనసుకు హత్తించి, కర్తవ్యాన్ని నేర్పి, సేవామార్గాన్ని ఉపదేశించారు.

ఈ పరీక్షలో వివిధ మనోభావాలు, సమ్మిశ్రిత మానసికతత్వాన్ని ప్రదర్శించి మెప్పించి నవలాకారులను తలపించారు జైనేంద్రకుమారులు.

మనస్తత్వచిత్రణలో పాశ్చాత్యులకంటె భారతీయులు వెనకపడ్డారన్న దుర్భావన—ఈ నవల చదివినచో—వెనకపడక తప్పదు.

ధర: రు. 1—0—0

---

:: విజ్ఞాన సాహిత్య వనం ప్రచురణ ::